శ్రీ మహాగణాధిపతయేనమః

# పరమ రహస్యం

ఇది రహస్య గ్రంథము. అంతియేకాదు. పరమరహస్య గ్రంథ మనవచ్చును. హిందువులకుం దెలియతగిన రహస్యములన్నియు నిందు చేర్చబడియున్నవి. వానినెఱింగినవారు దేవునియందే నిల్చినవార లగుచు జీవింపగలరు. అట్టి వ్యక్తులు — ఇహలోకమునను, పరలోకమునను సర్వసౌఖ్యముల ననుభవించెదరు.

రహస్య మెందుకని కొందరు ప్రశ్నింతురు. రహస్యముగ వ్యవహరింపబడిన కార్యకలాపములమూలముననే నూతనంబగు మహత్తర సృష్టి కార్యములు కొనసాగుచుండును. కనుకనే సృష్టింపగల శక్తిని కల్గియున్న వ్యక్తులు రహస్యముగా చరింతురు.

అందచందములగు బొమ్మలను తయారుచేయువారు ఇతరులకుం దెలియరానిరీతిగ రహస్యముగనుండుటకై వానిచుట్టు గోనెపట్టలనో, లేక బట్టలనో చుట్టి తీర్చిదిద్దెదరు. రాజ్యాంగమును నడుపువారు సైతము ప్రజలకుం దెలియరాదనుకొని లోలోన నత్యంత రహస్యముగ వ్యవహారముల సాగించుచుందురు. గృహస్థులు సంతతిని సృష్టించుటకుగాను రహస్య కలాపములనే కావింతురని యెల్లర మెరుంగుదుము. మంత్రోపదేశములు రహస్యముగనే జరుపబడుచుండును. మంత్రములం జపించువారు సైతము పెదవుల గదల్పనీయక రహస్యముగ మనసులోనే జపింతురు.

ఇక నీ గ్రంథమునకు పరమరహస్యమను నామధేయముం బెట్టుటకు హేతు విపుడర్థమై యుండును. పతనమగుచున్న భారత

జాతికి నూతనంబగు చైతన్యమును కల్గించుటకుగాను ఈ రహస్య గ్రంథము బహిర్గతంబయ్యెను. వేదములు, శాస్త్రములు, పురాణములు, ఇతిహాసము లెన్నియో కలవు. వానిం జదువనెంచినవారు ముందుగ నీ గ్రంథమును పఠింపగలిగినయెడల – నాస్తైన – చే గ్రంథమైనను రాజవీథిలో నడచుచున్నరీతిగ హాయిగ నుండును. భవనము లెంత గొప్పవియైయున్నను వానిచుట్టు తగినప్రహరీగోడలను నిర్మింపజాలని గృహస్థుల గతు లేమగును? కుక్కలు, నక్కలు, పందులు, గార్దభములు అవరణలో జేరి యింటి యజమానులను బాధింపగలవు. కనుకన ప్రహరీగోడలను నిర్మించుకొనుచుండవలెను. భారతీయుల హృదయములు అను సౌధములలోనికి శునక గార్దభ సూకరములు బుద్ధులను ప్రవేశింపనీయక పరిశుద్ధములుగా నుంచవలెననిన నీ పరమ రహస్య గ్రంథమును ముందుగ పఠింపవలసిన యావశ్యకత యెంతేని కలదు. ఆ రహస్యములం దెలియనందుననే భారతజాతికి పతనదశ సంప్రాప్తమైనది. అది యేరీతిగ దృశ్యమగుచున్నదో వినుడు.

తండ్రి కుమారు లొక్కటిగా యుండరు. అత్త కోడళ్ళలో చీలిక లేర్పడియున్నవి. అన్నదమ్ములలో కలియక లేదు. ఈరీతిగ భారతీయ వంశవృక్షమునకు చీడపురుగు పట్టినది. మరియు నాకులనన్నిటిని తినివేయుచున్నది. క్రమముగా నీ వృక్షముయొక్క కళకాంతులు నామరూపములు లేనివై యంతరింపక విడువవు. మాతృదేశ రక్షణమునకై వలయు నుపాయము లన్నియు నీ గ్రంథమున చేర్చబడినవని యెరుంగుడు.

రహస్యము అను పదమునకు గుహ్యము అను పర్యాయపదము కలదు. హిందూమత ప్రవక్తయగు శ్రీకృష్ణభగవానుడు ఆ పదమును పలుమారులు వాడియున్నాడు చూడుడు.

శ్లో॥ య ఇదం పరమం గుహ్యం
మద్భక్తే ష్వభిధాస్యతి (గీత)

అను శ్లోకమున పరమ గుహ్యమగు (అనగా పరమరహస్యమగు) బోధను గావించియుంటినని పల్కెను. మరియు నా రహస్యమును (మద్భక్తేషు) నాయందు భక్తి గలవారి కెల్లరకు (అభిధాస్యతి) ఎవరు బోధించుచుందురో - వారు నా మతమును ప్రచారమొనరింపగలరు.

"భక్తిం మయి పరాం కృత్వా మా మేవైష్య త్యసంశయః"
మరియు నన్ను విశ్వసించుచు మానవు లెల్లరు పరమ భక్తులై చరింపవలెను. తన్మూలమున (మాం ఏవ) నన్నే (ఏష్యతి) చేరగల్గుదురు. నా యనుగ్రహమును పొందనెంచిన వ్యక్తులు కనులు మూసికొని నన్ను ప్రార్థించినంత మాత్రమున సంతసింపజాలను.

"శ్రుతి స్మృతీ మమైవాజ్ఞా" (గీత.) (శృతి) వేదములను, (స్మృతి) ధర్మశాస్త్రములను నా యాజ్ఞలని భావింపవలెను. కావున వేదశాస్త్రములతో బోధింపబడిన ధర్మములను— విధిగా నాచరింపవలెను. నన్ను ప్రార్థించుటకంటె నా యాజ్ఞలను మన్నించి, నగా శిరసావహించి శాస్త్రీయములై వెలయు కర్మలలో మునిగితీరవలెను. ఆయా కర్మలం జేయుచున్నయెడల నేను తెల్పిన రీతిగ నా వారని సంతసించెదను. నామాటలను పాటింపనట్టి వ్యక్తుల నెన్నడు దరిజేరనీయనని యెరుంగుడు. ఆ రీతిగ నన్ను గుర్తునం దుంచుకొనుటకుగాను-

"అధ్యేష్యతేచ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః"
(గీత)

నిత్య మొకమారు నా వాక్యములతో నలరారుచున్న గీతా గ్రంథమును (అధ్యేష్యతే) విధిగా పఠించుచుండవలెను.

పాఠకులారా !

1. గీతాగ్రంథమును జదువుట యొకటియు,

2. దేవదేవునిచే నాజ్ఞాపింపబడిన కర్మకాండల నాచరించుట యొకటియు,

3. కర్మల నాచరించిన మాత్రముననే తనిపిజెందక నాయాధర్మనులను ప్రజలకు బోధించుట యొకటియు—

నివి మూడును సమకూడినప్పుడే జీవు లుద్ధరింపబడుదురు అనునది శ్రీకృష్ణుని భావము.

శ్రీకృష్ణభగవానుని హెచ్చరిక:-

1. కేవలము గీతాగ్రంథముం జదివి తనిపిజెందువారు నావద్దకు రాజాలరు.

2. సంధ్యావందనాద కర్మల నాచరించినమాత్రమున నన్నుజేరుదురని భావింపరాదు.

3. పై రెంటిని శ్రద్ధతో గమనించుచు మూడవదియైన వేరొక విషయమును గుప్తనం దుంచుకొనవలెను. అనగా నా మత ప్రచారమం దనురక్తులై యథాశక్తిగ భారతీయుల నుద్బోధింపవలెను.

అనుచు భగవానుడు తనను జేరు మార్గము జ్ఞానయజ్ఞమని సూచించియుండెను.

"జ్ఞానయజ్ఞేన తేనాహం। ఇష్ట స్స్యా మితి మే మతిః॥ (గీత)
అనుచు మతప్రచారము నొనరించుటయే జ్ఞానయజ్ఞమని హెచ్చరించెను. ఈవిషయము

పై శ్లోకరూపమున బోధించియుండెను. భగవాను డేమనెనో తెలిసెనా ? మతప్రచార కార్యమున నిమగ్నులై యుండవలెననెను.

అట్టి కార్యమును

(జ్ఞాన యజ్ఞేన) జ్ఞాన యజ్ఞ మని పిల్చెద నని స్ఫురింపజేసెను.

(ఇష్టసాన్యం) ఆ ప్రచారము నాకు ప్రీతికర విషయము. ధర్మములను బోధించు వార లెవరో వారే నిజమైన నా భక్తులు. యోగులనినను జ్ఞాను లనినను వారే. ఇది (మే—మతిః) నా మతము అని భగవానుడు హెచ్చరించెను.

పాఠకులారా ! మతి యనినను మతమనినను ఒక్కటే అభిప్రాయముల పుట్టను మతి యనెదను. మతమునగ నభిప్రాయమే కదా. మతి- సమ్మతి- మతము- సమ్మతము- అనునవన్నియు "(మన్ to think," అను ధాతువు నుండియే యుద్భవించినవి.

శ్లో॥ యే మే మత మిదం నిత్యం అనుతిష్ఠంతి
మానవాః॥ (గీత)

ఏమానవులు నా మతమును- నా మతిని- నా యభిప్రాయమును గురించి యారీతిగ (అనుతిష్ఠంతి) నాచరింతురో- అనుచు భగవానుడెంతయో ప్రియముగ బల్కి యున్నాడు. మానవులయం దమితముగా ప్రేమ కలవాడు భగవానుడు. ఆ దివ్య పురుషుడెంతయో ప్రేమించు వాడైనను సోపానముల నన్నింటిని ఎక్కుటకై మిక్కిలి శ్రమించి పై మెట్టున కెక్కియున్నట్టి మానవులం గాంచినపు డత్యంతమగు ప్రేమను జూపుచునుండును.

సర్వ గుహ్యా తమం భూయః ।
శృణు మే పరమం వచః (గీత)

నరులారా ! నేను వచించునవి పరమ రహస్య విషయములు. అనుచు పరమేశ్వరుడు వివరించి యుండెను. భారతజాతి నుద్ధరించుటకై అట్టిరహస్యములు ఈగ్రంథమున ప్రకటింప బడి యున్నవి. శ్రీకృష్ణ భగవానుని మార్గదర్శిగా నుంచుకొని యతనిని లోకైక రక్షకుడుగా భావించువారు నిజముగ దేశోద్ధారకుల శ్రేణిలో జేరెదరు. పాఠకులారా ! మీరును అదేరీతిగ దేశము నుద్ధరించుటకు ముందుకు రండు. భరత మాతను రక్షింపనెం

చిన వ్యక్తులు ముందుగ నీ గ్రంథములోని పరమ రహస్య విషయ ములం జదివి తీరవలె నని నాయాశయము. ఆపైన నితర గ్రంథము లంజదువ నెడల- యథార్థమును గుర్తింప గలుగు. లేదేని- అసత్య విషయములతో నిండిన హృదయములు కలిగిన వారలై జీవించు చుందురు. అట్టి జీవితములు దేశానర్థ దాయకములు.

వేదములను తలక్రిందుగా జదివినవారలై యున్నను సంస్కృతి భాషలో నుత్తీర్ణతను పొందిన వ్యక్తులుగానున్నను, ఆంగ్ల విద్యాకోవిదులై యం. ఎస్. సి. మున్నగు బిరుదముల నార్జించినట్టి ధీరవరులై యున్నను, వ్యాపారములలో నత్యంతనిపుణులై లక్షలాది ధనమును జేర్చిన వారలై యున్నను, నూర్లకొలది యకరములం బెట్టుకొని సేద్య మొనరించుచు భూస్వాములు అను బిరుదమును వహించిన రైతులుగా నున్నను—వారలు స్త్రీలయిన నేమి- పురుషు లయిన నేమి ! బాలురే కానిండు- యువకులును, వృద్ధులును అయి యుండనిండు- మరియు పండితులే కావచ్చును - లేదా పామరులై యుండవచ్చును. ఆ భేదములతో నిమిత్తములేకయే వారెల్లరీ గ్రంథ ములోని విషయములం దెలిసికొని తీరవలెనని నా విజ్ఞాపనము.

కొందరు సైనికు లీ క్రింది విధముగ హిందువుల పైనను వారి మతముమీదను దాడులు సల్పుచున్నారు. ఆ దాడుల నెదిరింప జాలక తమ గృహములలో నొకమూల గూర్చొనుచున్న యెడల మన దేశమునకు "భారత్" అను నామము సైతము నిల్చియుండు నని జాలము. ఇప్పటికే యీ దేశమున నొకింతభాగము పాకిస్థాన్ అను పేరును దాల్చెను. శేషించిన భాగము పాలిస్తాన్ లేక ఏసుస్తాన్ అను రీతిగ మారిపోవును. అవియుం గాదేని న్యూఇంగ్లండ్ యనిగాని— లిటిల్ అమెరికా యనిగాని మార్పును జెందతీరును. అంతటి మా ర్పును కల్పింపగల సైనికు లెవ్వరని ప్రశ్నింతురా ? వినుడు.

"సైన్యముల కధిపతియగు "యెహోవా"
యని ఆయనకు పేరు.

పాతబైబుల్-యెషయాకాండ-51అ. 16వ.

అను ప్రమాణము ననుసరించి పాలిస్తాన్ అను భూమిని సృజించినట్టి యెహోవా అను దేవునకు సైన్యాధిపతియను బిరుద మేర్పడియున్న దని యెరుంగుడు. ఆ దేవుడు తన ప్రజలను రెచ్చగొట్టుచు అన్యదేశ ములపై దాడులు సల్పుటకుగాను కొంత సైన్యమును తయారుచేసి యుంచెను. కనుకనే అతనికి సైన్యాధిపతి యను నామ మేర్పడెను. ఆ సైన్యములో తనివిజెందక ఇంటింటి దండయాత్రలను సాగించు టకు గాను తన ప్రియకుమారుడగు ఏసును ఈ లోకమునకుపం బంపెను. అతని మూలమున నొక మతము నెలకొల్పబడియున్నది. ఆ మతసంబంధమగు మార్గమున నడుచువారలుగ శాంతియుతముగ సాధనములం గల్పించి వాని మూలమున దేశములపై దాడులను సలుపుచున్నారు.

ఏసుగారి శిష్యులు సైతము మరికొంత సైన్యమును తయారు చేయగల్గిరి. ఆ సైనికులు దేశదేశములకు బోయి తమ పనులను సాగించుకొనుచుందురు. వారలే మన హిందూదేశమునకు విచ్చేసి యుండిరి. వారి దాడులలోని గూఢయుధములం గమనింతము.

## ఆ సైనికులు హిందూమతముపై వేయుప్రశ్నలు

1) శ్రీరామచంద్రుడు దేవుడైన యెడల తన భార్య నెవరో యపహరించెనని యేడ్చునా?

2) శ్రీకృష్ణును దేవుడనుకొని హిందువులు ప్రార్థించుచుందురు కదా. గోపికలతో క్రీడించుచున్న ఆ పురుషుడు దేవుడెట్లగును? మరియు పాలను పెరుగును వెన్నముద్దలను దొంగిలించుకొని తిను చున్న గొల్లడు హిందువులైన మీకు దేవుడెట్లయ్యెను?

3) బ్రహ్మ-విష్ణు మహేశ్వరాది దేవతలును-సూర్య-చంద్ర మహేంద్రాది దేవులును పరుల వనితలకై పోరాడినారు కదా! వారి యందొక్కరైనను బ్రహ్మచర్య నియమమును పాటింపగల్గిరా?

అట్టి దేవతలను పూజించుచున్న హిందువులకు ముక్తి యను నది సంభవించు ననవచ్చునా?

4) ఒక్క జన్మముననే వివిధ బాధల నోర్వజాలక ఉరితీసి కొనువారు కొందరును-కష్టపరంపరల నెదుర్కొనలేక నదులలో మునిగిపోయినవారు మరికొందరును-సాంసారిక బాధల సహింపజాలక నిప్పు నంటించుకొని మరణించువారు ఇంకొకరును-బ్రాహ్మణేతరు డగు శంబుకుండొకడు విషయ భోగముల నన్నిటిని విడనాడి వైరాగ్య మును పొంది తపమొనరించు చుండ శ్రీరాము డద్దాని నెరిగినవా డగుచు వెంటనే విమానారూఢుడై వెళ్ళి యతని శిరమును ఖండించె నని రామాయణమున వ్రాయబడలేదా?

కరుణాత్ముడగు దేవ దేవుడేల మనుష్యు సృజించెనని విలపించు వారు కొందరును మరల మరల ననేక పర్యాయములు జన్మించి తీరవలెనని బోధించుచున్న హిందూమతము నెవరు విశ్వసింప గలరని ప్రశ్నించుచునారు మరికొందరును లేరా?

5) భూతలంబున నెందును లేని జాతి భేదములు హిందువు లలో మాత్రమే యుండుటకు సరియగు సమాధానము వేద మూల మునను యుక్తి యుక్తులతోడను వచింపగల పండితు లుండిరా?

6) హిందుమత గ్రంథమగు వేదమును రచించిన మహాత్ములలో కొందరు జింకలకును మరియు చిలుకలకును జన్మించియుండిరికదా. కుక్కలకును-కప్పలకును జననమైన వారును కలరే! అట్టి వ్యక్తులచే నుపదేశింప బడిన వేదములు ముక్తి సాధనము లగునా?

(7) అహల్య - ద్రౌపది - వాలి భార్యయగు తార - బృహ స్పతి యొక్క ధర్మ పత్నియగు తార-రావణుని భార్యయగు మండో దరియు- నీమైదుగురు పర పురుషుల నభిలషించిన జారిణీ స్త్రీలై యుండిరని పురాణములు తెల్పుచుండ నా భామామణులను పరమ

పతివ్రతాశిరోమణుల క్రింద లెక్కించుచున్న హిందువులు పరిశుద్ధమగు చరిత్రను కల్గి యుండిరని యెటుల విశ్వసింపగలము.

(8) ఒకే వేదమును నాల్గు వేదములుగా విభజింప గల్గిన శక్తినిన్ని, ఒకేపురాణమును పదునెనిమిదిభాగములుగా విడదీయ గల శక్తినిన్ని - కల్గిన వేదవ్యాస మహర్షి యొక్క జన్మ వృత్తాంతమును తెలియ గల్గిన యెడల చేపల వాసనలతో నిండియున్న మత్స్యగంధి యను బెస్త వనితకు బుట్టెనని యర్థ మగుచున్నది ఇక నాతని చరిత్రమును వినుదమువిన - వితంతు స్త్రీలను పొంది ధృతరాష్ట్రుని మరియు పాండురాజును ప్రసవింప జేసెనని తెలియగల్గుదుము. విదురుని విషయమై చూతమని - నాతడొక దాసీ పుత్రుడు. వశిష్టుడు- వేశ్యాంగనకు జన్మించెను. భరద్వాజుడు పక్షికిం బుట్టెను. వీరందరు హిందువులకు ప్రమాణ పురుషు లవుదురా లేదా అట్టి వ్యక్తులకు సంబంధించినట్టి మతమునం దుదహరింప బడిన ధర్మముల నాచరించిన వారల నేమన వలెను ?

(9) మృతులైన వార లెచ్చటకో పోయి యుందురు కదా, వారికి ఆకలి దప్పికలున్నవో లేవో తెలియ జాలము. అట్టి వ్యక్తులం బిల్చి వారికై యన్నముం బెట్టుద రేల! పంచభక్ష్య పరమాన్నములతో మిళితమై యున్న యన్నమును తినువారలెవరు? ఆయన్నమును హాయిగా భుజించు వారు బ్రాహ్మణులు. తద్దినములం బెట్టుడని ప్రోత్సహించుట బ్రాహ్మణులకు బ్రతుకు తెరువై యుండు ననికాదా.

10) వివాహకాలమందు పెండ్లికుమార్తె యొక్క శిరమున ఎద్దుల మెడలపై నుంచబడు కాడిని నిల్పి-ఎశ్వేవ్వేయో మంత్రములం జదివెదరు. ఓ పెండ్లికుమారుడా! ఎద్దుల నుపయోగించుకొను రీతి ఈ వనితను వాడుకొనుచుండుము అను విషయము స్ఫురించుచున్నది. లేదా హిందువులు తమ భార్యలను పశువుల రీతిగ జూచుచుందురని వేరుగ జెప్పనవసరము లేదనిన నదియొక నేరమున జేరదు.

పై రీతిగ నణగద్రొక్కబడిన వనితలు మహిళాసంఘముల నెలకొల్పు కొని భర్తలను లెక్కింపక తమ మతమును విడనాడుచు మరియొక మతమున జేరవలసిన యావశ్యకత కల్గుచున్నదా లేదా?

11) వేదమంత్రములను వినిన మాత్రమున బ్రాహ్మణేతరుల చెవులలో సీసము కరిగించి పోయుడని ధర్మశాస్త్రములు తెల్పు చున్నవే! అట్టి మతమును విడనాడి బ్రాహ్మణేతరు లెల్లరు బైబుల్ అను పరిశుద్ధ గ్రంధమును జదువుచు-యెహోవాయొక్క మతమున జేర రెందులకు?

12) హరిజనులు హిందువులు కారా! అగుదురేని వారిని ముట్టరాదనుట-అదేటిమాట? పిల్లులను కుక్కలను స్పృశించుచున్న హిందువులు తమ సోదరులైన హరిజనులను దూరముగ నుంచెదరే? అది యోగ్యమా? మరియు మనుష్య లక్షణమై యుండునా?

అనుచు పై సైనికులు హిందువులపై దాడులు సల్పుచున్నారు. మరియు వానికిం దగిన ప్రత్యుత్తరముల నొసగజాలక ఇంకను బ్రతికి యున్నారు హిందువులు- అనుచుండిరి.

బురదపయి రాళ్ళు విసిరినయెడల తమ నెత్తిపయిననే పడు నని తెలుపుచుందురు పండితులు. ఇవి యన్నియు సనమసల లక్షణ ములు కావా యనుచున్నారు ఆ సైనికులు. ఇంకను వారి ప్రగల్భ ములం జూడుడు. హిందువుల నెల్లరిని తమ మతమున జేర్చుకొనుట కై యెన్నెన్నియో సన్నాహముల నొనరించు చున్నారు. హిందువు లెవ్వరైనను సరియే కాచుకొనగలరా! యని ప్రశ్నించు చుండిరి. ఇంకను హిందూత్వ మెక్కడిది? ఇదుగో మా సైన్యము వచ్చు చున్నది. ఇప్పటికే హిందూదేశమున అయిదువేలమంది కలరు మా సైనికులు. ఇంకను విరివిగా మరెందరో వెలువడ నుండిరి అను నినా దములం జేయుచున్నారు.

భారతీయులారా! ఇకనైనను గాఢనిద్రనుండి లెండు. గాఢాం ధకార బంధురంబగు నిశీధసమయ మంతరించినది. రెండవజాము

మరియు మూడవజాము సైతము దాటిపోయినవి. నాల్గవ జామున సగభాగము సమసిపోయినది. ఇదే సమయమున మన యదృష్టవశమున విశ్వహిందూ పరిషత్ అనునది యావిర్భవించెను. కొక్కొరో కోయని కోళ్లు కూయుచున్నవి. "కావ్ కావ్" అనుచు వాయసము (కాకులు) అరచు చున్నవి. పశువులు లేచినవై పొలములకుం బోవు చున్నవి. ఇక మానవులమైన మనము నిద్రించుటఁ? పిల్లలారా! లెండు లెండు అనుచు మన వేదమాత యొక్క సందేశమును వినిపించు చున్నది. దాని నాలకింతము రండు.

## మాతృ సందేశము

సీ. సృష్టి పూర్వమునుండి సృష్టికు రాణియై
మనల బెంచెను వేదమాత యనుము
తరువాతి మ్లేచ్ఛ క్రైస్తవ గౌణ వేదముల్
చర్చింప తల్లికి సవతు లనుము
సవతిబిడ్డలలోని సౌమనస్యము నేల
జెప్ప గ నది సుప్రసిద్ధ మనుము
మతమే మొ తెలియని మతిహీనులను జూచి
నింద సేయుట రిది నిక్కమనుము
నిందితులై తల్లి కుందుచుండగనోర్చి
యుండుటాత్మజుల కనుచితమనుము
పరబోధనలువిని భారతీపుత్రులు
పరధర్మ పరులౌట పాపమనుము
వర్ణసంభ్రష్టులై వనట నొందుచు వేద
బాహ్యులైయుంట నసహ్యమనుము

తల్లియే సత్యముగ తమదైవమనుము
తల్లి మనతల్లి కల్పకవల్లి యనుము
మాతృవాక్యంబు సుతులకు మాన్యమనుము
అనుచు ఘోషించె మనతల్లి యాంధ్రులారా!

పాఠకులారా! మనతల్లి కడవలు కడవలుగ కన్నీరు నొలికించుచున్నది. ఆ మాతృ దేవిని సంతసింప జేయు తలంపు లేదేని——

## భారత మాతకు జై

అను నినాదములతో వ్యవహరించువార లీదేశమున నుండరు. ఎందుకన-నొకింతకాలములో మన వంశీయులెల్లరు అన్యమతము లలో చేరెదరు. పాకిస్థాన్ అనునది ఏ కాశ్మీరమునో కబళింప నెంచుచున్నది. తూర్పుదిశయందున్న పాకిస్థానముకూడ తన చుట్టుప్రక్కల నున్న దేశ మునువశమొనరించుకొనుటకు వాంఛించుచున్నది. నాగాల్యాండ్ అను నదిహిందూస్థానమునుండి విడబడ నుంకించుచున్నది. మరియు అస్సాం దేశమును తన వశములో చేసికొన నెంచినది. భారతదేశమునకు రెండు పార్శ్వములందును ఇట్టి దారుణ చర్యలు చెలరేగుచున్నవి. ఇక మన దేశము యొక్క మధ్య భాగమున నున్న గోవా యొక్కయు కేరళ యనునది మరియొకటియు క్రైస్తవస్థానము నేర్పాటొనర్చుటకు యత్నములం జేయుచునుండెను. ఇక హిందూస్థానమనునది దేశపటమున నుండబోదు. అందుకై ముందుగ మనమందరము ప్ర[illegible]మింప వలెను. అనగా నాయా సేనలను మతబోధకై మన యిండ్ల లోనికి రానీయకుండా జాగరూకులమై మెలంగ వలెను.

ఆ సైనికుల ప్రశ్నలను పండ్రెండింటిని వినగలిగితిమి. వాని కన్నిటికిని జవాబులం జెప్పుటకు హిందూమత గ్రంథమాల వెలువడెను. ఒక గ్రంథము వెయ్యి పుటలతో కొలది నెలలలో ప్రకటింపబడును. కొన్ని ప్రశ్నలకు ప్రత్యుత్తరము లా గ్రంథమున దర్శింప నగును. ఆటుపైన మరియొక గ్రంథము

వెయ్యి పేజీలు కలది వెలువడనున్నది. అవి రెండును రెండు ఖడ్గములుగా నుండును. ప్రశ్నపరంపర లెన్ని యుదయించినను వాని

నన్నిటిని తుత్తునియలం జేయఁగల సమాధానములతో విలసిల్లునని యెరుంగుడు.

ప్రకృతమున పై వానిలోనొక్క ప్రశ్నకుమాత్రము ప్రత్యుత్తరంబీయ బడును. అంతటితో నా ప్రశ్న-నామరూపములం గోల్పోయి స్మశాన వాటికలో భస్మమైపోవును. శ్రీరామచంద్రుఁడు దుఃఖించెనా లేదాయని యొక సైనికుడు పల్కెను. వెంటనే దుఃఖింపవలసిన యవసరము లేదని వానికిం జెప్పెదను. ఎవ్వాని ప్రియపుత్రుని ఆమహానీయునిం బట్టుకొని సిలువపై జేర్చి కత్తులతో బొడుచుచున్న యెడల నారామచంద్రుఁడు భోరున నేడ్వవచ్చును. ప్రాణములం గీసికొని పోవువారలెన్నడును ఆమహానీయుని చెంతకు వచ్చినవారుకారు. ఏమనుచున్నారా - భార్యకై యేడ్చెనా? ఆ భార్య నెవరో యెత్తుకొని పోయి రేని - మరియొక స్త్రీని పెండ్లాడవేలనేమి రాజాధిరాజగు నామహానీయునకు భార్యలకేమికొదవ? తన భార్య నెవరు సంగ్రహించినను మరియొక స్త్రీని పెండ్లాడగలశక్తి కలిగినవాఁడు కాయెనేని నవయువ్వనాంగిని పెండ్లాడి సుఖింపగలరే. వలదు వలదన్నను రాజాధిరాజు లెందరో సంఖ్యను జెప్పవలెనని నూటయెనిమిది మంది తమ కుమార్తెలను రామచంద్రున కొసంగుటకు ముందంజవేయగలరు. అట్టిమహానీయుడు తన భార్య నెవరో యెత్తుకొనిపోయెనని దుఃఖించునా యేమి? దరిద్రదామోదర చక్రవర్తి శిఖామణియగు కటికిబీదవాఁడెవఁడైన నుండినయెడల-ఆతఁడెటులనో అత్యంతకష్టతరముగ పెండ్లాడియుండును. అట్టి వ్యక్తియొక్క భార్యను ఎవరో సంగ్రహించి రనుకొందము. మరియొక స్త్రీని పెండ్లాడజాలనందున తన భార్య నెవరో యెత్తుకొని పోయిరని మితిలేని దుఃఖమును పొందుచు నేడ్చితీరును. ఇక శ్రీరామచంద్రుఁడనిననో - ఆతఁడొక రాజాధిరాజు. కోరినయెడల - నెందఱో దాతలు తమ కుమార్తెల నీయగలరు. నిజమారయ నాతఁడు జితేంద్రియుడు. కరతలామలకమువలె సంసిద్ధమైయున్న సింహాసనమును పరిత్యజింపగలిగెను. నారగుడ్డలం గట్టుకొని బ్రహ్మచర్యమును బూనినవాఁడగుచు నరణ్యమునకుం బోయెను. అట్టివానికి భార్యాసుఖం బెను

లకు? అయితే దుఃఖించెనా లేదా యనెదరేమో? అంకుల కెవ్వియో యితర కారణము లుండును. వానిం దెలియఁగలిగితిమేని ఆ మహనీయు డెంతమాత్రము దుఃఖించియుండడని నిశ్చయింపగలము.

హిందువులు నోరుపోని వారనియు మంచి చెడ్డల నెఱుంగలేని చవటలనియు శాంతి శాంతియని తమ యసమర్థతను ప్రకటించు వారనియు మనసైనికులనుచుండిరి. యుద్ధములం జేయు సైనికులు ఒడలు మరచి వ్యవహరింపగల యలవాటును కలిగియుందురనుట నిజము. ఒడలెఱుంగని సమయమున నెవ్వెవ్వియో నోటికి వచ్చినటు లెల్ల వదరుచుందురు. మనపై విసరి వేయబడిన ప్రశ్నలు కూడా అదేరీతిగ వివరములం దెలియగల తెలివి లేని సైనికుల నుండి గోగుపుల్లలను బోలిన బాణములై బిరబిర వచ్చుచున్నవి. ఉక్కు కత్తులచే బొడవబడిన వాడుకాడే ఆ మహనీయుడు! ఇక దుఃఖమేల కల్గునో తెలుపగలరా? రామాయణ గ్రంథమునం దెచ్చటనైనను శ్రీరాముడు దుఃఖించెనని యుండెననుకొందము. వెంటనే యెవరైననతని-గొట్టిరా లేక పొడిచిరా యని ప్రశ్నించుకొనకయే "ఏడ్చెను ఏడ్చెను" అనుటకుపక్రమింప నగునా? నిజమారయ నాతడెన్నడును యేడ్చిన వాడు కాడు. నాటక రంగమున పాత్రధారణ మొనరించి యున్న వ్యక్తు లెందరో యుందురు. ఆ సమయమున వారిలో నొకరో యిరువురో రోదన (ఏడ్పు) మొనరింతు రనుకొనుడు. అది నిజమగు దుఃఖమా? కాదు. దుఃఖమే యనుచు భాషించువారెవరై యుందురు? నాటకములనిన నెట్టివో తెలియని యడవి మనుజులై యుందురు. ఒకానొక నాటక రంగమున చంద్రమతి తన పుత్రుడు మరణించెనని యేడ్చుచున్న దనుకొందము. ఆ దృశ్యమును గాంచి అడవినుండి క్రొత్తగా విచ్చేసి యున్న మనుష్య పశువు లేమనెదరు అయ్యో పాపము! ఆ బాలుడు పాముకాటుచే జచ్చియుండునని భావింతురు. అది నిజమగు దుఃఖమా? కాదు. ఎవని పుత్రులైనను సరియే నిజముగ మరణింతురని యారీతిగ దుఃఖింతురని తెల్పుటకై నాటకములోని చంద్రమతిగానున్న ఒకానొక పురుషుడు యేడ్చిన

పొడగుచు ఆదృశ్యమును ప్రజలకుం దెల్పుచు నుండును. అంతియేకాని నిజముగ లోలోన దుఃఖించి యుండడు. అది నిజంబని యెల్లర మంగీకరింతుము.

ఈ విషయము నెంతగ వివరించుచున్నను అడవిగొడ్డులకేమి తెలియును? తమ తెలివిలేనితనమును నాగరికులమైన మనపై నారోపించుచుందురు. ఇది లోకమర్యాద. శ్రీరామచంద్రుడు సైతము నాటకములోని వేషధారియని యెరుంగుడు. నాటకరంగ మొకటియున్నపుడు అందువేషధారులెందరో దృశ్యమగుచుందురు. దాని నెవ్వరును కాదనజాలరు. కాన శ్రీరామచంద్రునకు నాటకరంగ మెచటనుండెనని క్రొత్తగా నవీన్యమునుండి విచ్చేసియున్న వ్యక్తులు ప్రశ్నింపక పోరు. హిందుమత వాఙ్మయమునందు దేవదేవుని కొక బిరుదమున్నదని యెరుంగుడు. జగన్నాటకసూత్రధారి యనునది ఆ బిరుదము. దేవునిదృష్టిలో నీ జగము నాటకరంగమని పై శబ్దమున కర్థము.

ఆ దేవు డొకమారు శ్రీరామచంద్ర వేషమును దాల్చెను. శేషించిన దేవతలు ఈ ధరాతలముపై నవతరించి వారివారికిం దగిన వేషములం దాల్చిరి. రామాయణగాథ యంతయు నిదేరీతిగ ప్రచలితం బైనది. ఆ చరితము నెవరు పఠించుచున్నను నాటక దృష్టితో జదువుటకు నేర్చుకొనవలెను. పురాణ గాథలను నాటకము లన వచ్చునా యని ప్రశ్నింతురేమో? అవును. అవి నాటకములు.

దేవీభాగవతములోని ప్రమాణముం జూతము.

శ్లో॥ యథా నటో రంగగతో
నానారూపో భవత్యసౌ
ఏకరూప స్వభావోపి
లోకరంజన హేతవే।

నటు డొక్కడై యున్నను వివిధ వేషములం దాల్చును. లోకమును రంజింప జేయుటకు పై రీతిగ నటించును.

(తథైషా దేవకార్యార్థం) ధర్మస్థాపనముకై దేవతలు యత్నించుచుందురు. అదియే వారి కర్తవ్యము.

(అరూపాపి)—రూప లేనిదై యున్నను ప్రకృతిమాత వివిధరూపముల కల్పింప

(స్వలీలయా)—నానారూపములతో దేవత

(కరోతి)—లవతరింతురు. మరియు లీలామాత్రముగ

(బహు)—నెన్నెన్ని యో చర్యలం జేయుచు

(రూపాణి)—నుందురు. నాటక రంగమున

| | |
|---|---|
| నిర్గుణా సగుణానిచ॥ దేవీభాగవతం 5 స్కంధం 8 ఆశ్వాసం | నాచరింప బడిన పనులన్నియు సత్యములు కావు. అందలి యంతరార్థమును మాత్రమే స్వీకరింపనగును. అటులనే జగన్నాటకమున నటించుటకు విచ్చేసియున్న దేవతల చర్యల లోని అంతరార్థమును గ్రహించుటే బుద్ధి మంతుల లక్షణము. |

పురాణేతిహాసములలోని కథలన్నియు నాటకములోని కథల వలె వ్యవహరింపబడినవని యెరుంగుడు.

| | |
|---|---|
| శ్లో॥ అంతర్యాగం పురా కృత్వా బహిర్యాగ మథాచరేత్ (ఆగమశాస్త్రం) | అంతరార్థములతో కూడియున్న యజయా గాదులను ముందుగ నాచరించి యనగా నందలి సత్యార్థమును గుర్తించుచు బాహ్యార్థములతో కూడుకొనియున్న యజ్ఞము లను- లోకక్షేమమునకై ఆచరించి తీరవలెను వాని నాచరించునపుడు- వెలుపలకు గోచ రించుచున్న అర్థమును సత్యమని భ్రమించు వారు తెలివిలేనివా రనబడుదురు. కావున పురాణేతిహాసముల లోని కథలవిషయమై అంత రార్థమును జెప్పుకొనుటకు ప్రతి వ్యక్తియు శిక్ష ణము పొందవలెను. |

| | |
|---|---|
| శ్లో॥ ఇతిహాస పురాణాభ్యాం | ఇతిహాస పురాణముల లోని కథలకు (వేదాంతార్థః) |

వేదాంతార్థః పరికాశ్యతే శ్రీధరీయ (వ్యాఖ్య)

అంతరార్థము ను చెప్పుకొనుటకై నేర్చియుండవలెను. లేదేని వెక్కిరింపబడుదురు. మరియు నీచులలో చేర్చబడుదురు. అట్టివారలు దేశమునకు అనర్థదాయకులు. ఎందుకన వారి మూలముననే దేశమునకు చేటు వాటిల్లును.

హిందూ వాఙ్మయములోని – వేదములందును, పురాణములందును, ఇతిహాసములందును వివరింపబడిన కథలకు బాహ్యార్థములను మాత్రమే చెప్పుకొనుచు కాలక్షేపన మొనరించువారు దేశమున కెంతయో యుపకార మొనరించినవార లయ్యేదరు. అంతవరకు పోనేల ? వేమనశతకములోని పద్యమును జూతము–

పద్యం– కుక్కనుదినువాడు గురులింగజంగంబు
పందినితినువాడు పరమయోగి
ఏనుగును తిన్నవా డెంతటివాడయా
విశ్వదాభిరామ వినుర వేమా ?

కుక్కలను, పందులను, ఏనుగులను తినుమని తెల్పెనేమి ఆ వేమనయోగి ? కావున అంతరార్థములం జెప్పుకొనుచు వ్యవహరించువారు మాత్రమే దేశము నుద్ధరించినవార లగుదురు. శ్రీకృష్ణ పరమాత్మ వెన్నను దొంగిలించెననియు, జారుడై వ్యవహరించెననియు నీరీతిగ బాహ్యార్థములం జెప్పుచున్నవారిని దేశద్రోహుల క్రింద పరిగణింపవలసియుండును. అట్లులనే రామచంద్రుని విషయమును గుర్తింపవలెను. వెలుపలకుం దెలియుచున్న యర్థమును బట్టుకొనగాదనుటకు నాటకరంగములోని విషయములం జూచినం జాలు. నాటకరంగమున నటించు నర్తకు డొకరి ధనమును దొంగిలించును. అది నిజమా? కాదు. ఒక డొక వనితనుం బొందును. అదియు నిజము కానేరదు. జారచోరత్వము లెంతటి దుష్టములై యున్నను పైరీతిగ నాటకములలో జరిపినయెడల– నిజముగా తత్కర్తలపై దోషము నారోపింపరాదు. ఎందుకన– యా చోరత్వము నిజమైనది

కాదు. విచారింప నది చోరత్వమే కాదు. నాటకములోని మర్యా దల నెరిగియుంటిరి కదా.

క. నర్తకుని భంగి పెక్కగు
మూర్తులతో నెవ్వడాడు మునులు దివిజులున్
గీర్తింపనేర రెవ్వని
వర్తన మొరు లెరుగ రట్టివాని నుతింతున్.
(గజేంద్రమోక్షణము)

అను పద్యము కూడ దేవదేవుని నటకునిగా వర్ణించియున్నది.

దేవతలు సైతము జగన్నాటక రంగమున నవతరించి నూ రేండ్ల వరకో— లేక వెయ్యేండ్ల కాలమో వ్యవహరించుచు తుది యందు పరలోకమునకుం బోయెదరు ఆరీతిగా వ్యవహరించి అటు పయిన బహుకాలము జపింపగలిగినపుడు ఆ దృశ్యము సామాన్య జనులకు నాటకముగా నుండునని తోచదు. "నాలుగయిదు గంటల లోనే ముగింపదగిన నాటకములతో పురాణగాథల నెటుల పోల్చు కొనగలము" అను సంశయము సయితము కలుగును. కావున జీవుల చరిత్రలకును, భూలోక సంబంధములగు దేహములం ధరించిన దేవ తల చరిత్రలకును యెంతయో వ్యత్యాస మున్నదనవచ్చును. నిజ ముగ వారి కథలు వందలకొలది సంవత్సరములు జరిగియుండె ననుట మాత్రము సత్యము. ఎవ్వియో కొన్ని ధర్మములను ప్రజలకు బోధిం చుటకు సమర్థులయిన నటకులు నాటకరంగముల కేతెంచి వివిధము లగు పాత్రలను ధరింతురుకదా! అటులనే సమర్థులయిన దేవతలు సయితము జగన్నాటక రంగమునకు విచ్చేసి నటించి పోయెదరు. అయితే మన నాటకములకును, దేవతల నాటకములకును వ్యత్యాస ముండును. నాటకములలో నటింపనెంచిన మానవులు తమ దేహము నందంతటను వివిధములగు రంగులను పూసికొని 4, 5 గంటల కాలము మాత్రమే ఆయా రంగులతో నిలిచియుండగలరు. ఆరీతిగ వ్యవహరించుచున్న పాత్రధారులరీతి దేవతలు రంగులం బూసి

కొనరు. వారు నటులయియున్నను మానవులలోని వేషధారులవలె వ్యవహరించువారు కారు. 5, 6 గంటలలోనే తమ నాటకమును ముగింపజేయ నవసరము సయితము వారలకు గోచరింపదు. దేవతలు తమ సంకల్పబలముచే తామే ఆయా వేషములను వేయగలుగుదురు. వందలకొలది సంవత్సరము లయినను ఆ యా వేషములతో భూలోక మున చరించుచు మనవలెనే జీవయాత్రను సాగింపగలరు. ఆ నాటకము పరిసమాప్తి అయిననంటనే తమ లోకమునకుం బోయెదరు. ఆ మధ్యకాలమున నటకులకేల దుఃఖము వాటిల్లును. శ్రీరామ చంద్రుడు దేవుడయి యున్నయెడల దుఃఖించెనేమి యని ప్రశ్నింప దగునా! జగన్నాటకరంగమునకు విచ్చేసియున్న కారణమున నా మహనీయుని దుఃఖమును దుఃఖములో చేర్చుకొనజాలము. ఎందుకన నటన మొనరించువారి దుఃఖము నిజమగు దుఃఖ మనజాలము.

ఇకమీద మన క్రైస్తవసైనికుల దేవుని విషయమై ప్రసంగింతము. ఏసుగారెన్నడును దుఃఖించియుండలేదా? దుఃఖించెనని బైబులునందుండెనేని తమ దేవునిలోని లోపములను కప్పిపుచ్చ నటుల కాకపోదు. ఏసుగారికి సయితము మరణభీతి కలిగియుండెనని యెరుంగుడు. బైబులునందును ఏసుగారి దుఃఖవిషయమై వ్రాయబడి యున్నది. అందలి వాక్యములం జూతెము. ఏసును పట్టుకొనుటకయి శత్రువులు మీదిమీదికి వచ్చుచుండిరి. ఆ దృశ్యముం గాంచి యేసుగారు యీక్రిందివిధముగా తన శిష్యులకుం జెప్పెను.

"మీరు శోధనలో పడకుండుటకై మెలకువగ నుండి ప్రార్థనలు చేయండి. ఆత్మ మరణించుటకు సిద్ధమే కాని శరీరముబలహీనము (దేహమునకుచావునం దిష్టము లేకున్నది) అని పేతురుతో జెప్పి తిరిగిపోయి యింతకు పూర్వము పలికిన మాటలనే తిరిగి పలుకుచు ప్రార్థించెను." (37 నుండి)

మరణము కలునని వినినతోడనే ఏసుగారి కెంతయో భయము వాటిల్లెనని పై వాక్యముల మూలమున తెలియ గల్గుదుము. బైబి

లును పై రీతిగ నెంతయో శ్రద్ధతో పరిశీలింప గల్గిన యెడల నీరీతిగ పరమ రహస్యముల నెన్నింటినో యెరిగి క్రైస్తవ మత ప్రచార మూలమున కలుగనున్న బాధలను నివారించు కొనుటకై యత్న ములంజేయ నుత్సహింతుము. ఏసుక్రీస్తు మితిమీరి దుఃఖించి యుండెననుటకు ప్రమాణము జూతము.

 క్రీస్తు యేసు—మితిమించి దుఃఖించియుండెను. ●

"వారు గెత్సెమనే అనబడిన చోటుకు వచ్చునపుడు ఆయన (ఏసు) నేను ప్రార్థన చేసి వచ్చువరకు మీరి క్కడ కూర్చుండుడని శిష్యులతో చెప్పి పేతురును, యాకోబును యోహానును వెంటబెట్టు కొనిపోయి మిగుల

విభ్రాంతి నొందుటకును, చింతాక్రాంతు డగుటకును ఆరంభించెను. అప్పుడాయన నాప్రాణము మరణమగునం తగా దుఃఖములో మునిగియున్నది. మీరిక్కడ వుండి మెళుకువుగా నుండుడని వారితో చెప్పి కొంత మారము సాగిపోయి

నేలమీదపడి సాధ్యమైతే ఆగడియ (శిక్షా సమయము) తన యొద్దనుండి తొలగిపోవలెనని ప్రార్థించుచు

నాయనా! తండ్రీ! నీకు సమస్తము సాధ్యము. ఈ గిన్నె నాయొద్దనుండి తీసివేయుము."

క్రొత్త బైబిల్. మార్కు సువార్త 14 అధ్యా. 33నుండి.

తనను సిలువవేయుటకై యెవరో వచ్చుచుండిరని భీతిల్లి యెటులనైనను తప్పించు కొనుటకై విలపించి యుండెనని విశదమగు చున్నది. తాను బ్రతికి యుండవలెనని యభిలషించుచు—పై రీతిగ వ్యవహరించె ననుట దోషము కాకపోదు. ఆచర్యను దుఃఖముక్రింద

లెక్కింపకయే శ్రీ రామచంద్రుడు దుఃఖించె ననుచుందురు క్రైస్తవులు. ఆ సైనికుల నేమనవలెనో తెలియజాలకున్నాము.

"ఏలోయీ! ఏలోయీ! లామా! సబక్తానీ!" అని బిగ్గరగా కేకవేసెను. ఆమాటకు నాదేవా! నాదేవా! నన్నెందుకు చేయి జారవిడచితివి అని అర్థము

(మార్కుసువార్తనుండి మత్తాయిసువార్త 27 అధ్యాయంలో సైతమీవిషయమును వ్రాయబడెను.)

"దేవా! నన్ను బ్రతికింపక మృత్యువున కర్పింతువా? నీహస్తములతో బట్టుకొని రక్షింతువని యాశించితిని. కాని చేయిజార విడచితివి." అని కేకవేయ సాగెను. ఇదంతయు దుఃఖ సంబంధమగు ప్రసంగమై యుండదేమి?

ప్రజలపాపములను తనపై వేసికొని మరణింతునని పల్కియున్న యేసుగారు తనకు మరణసమయ మాసన్న మయినపుడు తనను విశ్వసించిన ప్రజల పాపముల గూర్చి రానీయక అనగా వారి పాపముల బోగొట్ట నెంచక జీవింప వలెనని యాశించెనా? లేదా? అది పిరికితనమున చేరకపోదు. ఇక లోకరక్షకుడని యెవరు పిలువగలరు. తనను తానే రక్షించుకొనలేక దుఃఖముల పాలయ్యెను. అయినను ఆవిషయమై యెక్కింత విమర్శింతము. తన సంకల్ప బలముచే ప్రజలపాపములను దీసివేయగల మహిమకలిగినవాడయినయెడల నెంతయో యోగ్యముగనుండును. అట్టి మహిమఆయనలో నెలకొని యుండ లేదని అర్థమగుచున్నది. కొందరు మంత్రవేత్తలు పరుల రోగములను తమ యందు సంక్రమించునటుల జేసికొనుచుందురని వినియుందుము. ఆ శక్తి మంత్ర సంబంధమైయుండును. నిజముగ దేవుడై యున్నవాడైన డైననుండునేని ఆయన ప్రజల రోగములను తనపై వేసికొనకయే వానినన్నింటిని వారిలో నుండనీయక తొలగింప గలడు. శ్రీకృష్ణుడు

దేవుడై నందున కుబ్జయొక్క వ్యాధిని మరియు వంకరటింకరగ నున్న దేహమును సంకల్ప ప్రభావమునచే సరిజేయ గల్గెను. దైవకార్యము లీరీతిగ నుండునని యెరుంగుడు. దేవతా పురుషుల మహిమలకున్నూ, సిద్ధపురుషుల మహిమలకున్నూ, మంత్రవేత్తల మహిమలకున్నూ వ్యత్యాస మనంతముగ నుండుననియు నెరుంగుడు.

క్రీస్తు ఒకానొక సిద్ధపురుషుడు. తనకడ కొన్ని సిద్ధులను కలిగి యుండెను. అంతియేకాని ఆ సిద్ధులలో తగినంతగా పూర్ణత్వమును సాధించియుండడు. కొంతమటుకు లోకమున నుపకరింపగలడు! రక్తమును కార్చి దానితో పాపములం దడుపుట యనునది దైవసంబంధమగు శక్తి యనరాదు. తాను స్థూలదేహమును పొందియుండెను గదా. అందలి రక్తముతోనే పాపములం బోగొట్టవలెనని తెలిపి యున్న మాట నిజమగునేని తన మరణానంతరము తనను ప్రార్థించుచున్న భక్తుల పాపములం బోగొట్టుటకుగాను తాను మరియొకమారు జన్మించి రక్తముం గార్చుచు మరణింపవలసియుండును.

మరియు ఏ ప్రభువుల మూలముననో సంహరింపబడవలసిన దురవస్థకు పాల్పడి తీరవలెను. పునర్జన్మమును సమ్మతింపని యేసుగారు వేరొక స్థూల రూపముతో భూలోకమున జన్మింపవలసి యుండును. ఒకవేళ జన్మించి యున్నను వానిని సంహరింపగల ప్రభువు వేరొకడు మరల జన్మింపవలసి వచ్చును. ఇవి యన్నియు అసందర్భ ప్రలాపములు. కావున క్రీస్తుగారి మరణానంతరము ఆయనను ప్రార్థించు వారికి పాపపరిహారము జరుగగలదనుమాట విశ్వసింప దగినది కాదు. మరియొక క్రొత్తయెత్తు నెత్తెదరేమో! అది ఏదనిన వినుడు. రాబోవు ప్రజల విషయమై తాను భూమియం దవతరింపకయే యేసుగారు ఒకానొక యోచనచేసి యుండెననుచుందురు. నాయనంతరము జన్మింపబోవు ప్రజలారా! నన్ను విశ్వసించి ప్రార్థించు చుండుడు. మిమ్ములను కడతేర్చగలను అని ప్రవచించి యుండె ననుకొందము. ఆహా ఆ రీతిగ సంకల్పింపరాదని వచింపము. ఆ స్థితిలో పాపములను నెట్టి

వేసినది సంకల్ప బలమే కదా! అంతటి మహత్తరమగు సంకల్పశక్తిని కల్గియున్న తాను భూలోకమున జన్మింపకయే పరలోకముననే నిల్చిన వాడగుచు తన తండ్రివలె మేఘమండలమునుండి దిగివచ్చి తనను ప్రార్థింపుడని తెల్పిన నెంత బాగుండును. ఆ మాటల నాలకించిన వారలు ఆ రీతిగ ప్రార్థించి పరలోకమునకుం జేరియుందురే. అటుల గావింపక రక్తస్రావమునకై యత్నింపనేల. రక్తస్రావముల మూలమున నొక విధంబగు మహిమ లేకపోలేదు. అవి క్షుద్రదేవతలకై చేయబడుచున్న కలాపము. శుద్ధదేవతల కా విధానము నింద్యము. తమయందు భక్తిప్రపన్నులగుచు స్తుతిరూపములతో నుచ్చైస్వరంబున శుద్ధదేవతలను ప్రార్థించుచు రక్తస్రావమును కల్గింపరేని యా పరిశుద్ధులగు దేవతలు సైతము విధిలేక సంతసింప గలరు. కాని ఘోరరూపములగు మార్గములం జూపెదరు. అటుల జరిగించి యున్నను కొంతవరకు మేలు కల్గుచు నుండును. క్రోధపూరితులైన రాక్షసుల వంటి రాజులచే బంధింపబడి కత్తులచే పొడవబడినపుడు సైతము రక్తము స్రవించును. కాని తన్మూలమున పాపములు సంహరింపబడవు. ఎందుకన మరణ సమయమున మంత్రముల నైనను ఏసుగారు వచించినవారు కాదు. మహమ్మదీయులు సైతము ఒక జంతువును కోసి తినవలెనని యపేక్షించి నపుడు అల్లాను ప్రార్థించుచుందురు. ఆ ప్రార్థనయందు మంత్రము లుండును. హిందువులుకూడ మంత్రములం జదువుచు పశువులను సంహరింతురు. అందును మంత్రములు కలవు. మంత్రములతో నిమిత్తములేనివారు క్రైస్తవులు. పిలాతు అను రోమన్ గవర్నరు ఏసును చంపించుటకు ఆజ్ఞాపించి యుండెను. అందుకనియే ఆయనను సిలువపై బంధించినవారలయిరి. పోనిండు. ఏసుగారైనను తన రక్తమును స్రవింప జేయుటకై నిశ్చయించి-యానందసాగరమున నోలలాడుచు దేవా! యిదిగో! నా రక్తమును చిందింపజేయు చున్నాను. దీని మూలమున ప్రజల పాపములం బోగొట్టుమనుచు ప్రార్థించెనా? అదియు శూన్యమే. ఏసు

క్రీస్తు యొక్క రెండు పార్శ్వములందును ఇరువురు బందిపోటు దొంగలను బంధించి యుండిరి. ముందుగా వారలను జంపుచు నా యపరిశుద్ధ స్థలమున క్రీస్తును నిల్పినవారలయిరి. ఆ దృశ్యము యజ్ఞముతో పోల్చనగునా? ఈ నడుమ ఆ సైనికులు ఏసుగారి మరణమును యజ్ఞములోని పశువధతో సమానమనిరి. ఆయన మరణము యజ్ఞతుల్యమా? అయితే ఋజువు చేయగలరేమి? యజ్ఞముం జేయు స్థలము పరిశుద్ధమైయుండవలెనను నియమము లేదు కాబోలు! ఎందరో దొంగలు- మరెందరో హంతకులు- వధింపబడిన తావును యజ్ఞభూమి యనుటకు నోరెట్లు వచ్చును? అది స్థలము పాపపూరితమైన అపరిశుద్ధమగు స్థలమై యున్నది. అట్టిది యజ్ఞమునకుం దగునా? విచారింప నా తావు అపరిశుద్ధమగు స్థలము అందు వధింపబడువా రెల్లరు ఘోరాతిఘోరకృత్యములం జేసినవారలు. ఆ కపాలస్థలము నరపశువులం జంపు వధ్యభూమి యనుట కభ్యంతరము లేదు. అట్టిదానిని యజ్ఞభూమి యని యెవ్వరనగలరు. యజ్ఞభూమియందు ఒక మేకను చంపవలెననిన ముందుగ నెన్ని దినములనుండియో యెందరెందరో మహనీయులు ఆ స్థలమును మంత్రమహిమచే పావన మొనరింతురు. మేకలను, గొఱ్ఱెలను వధించుటకై నియమింపబడిన ఆ పరిశుద్ధమగు యజ్ఞశాల యెక్కడ? దొంగలు, హంతకులు అయిన పాపులను వధించు వధ్యశాల యెక్కడ? సైనికులకు బండతనముగా నున్న మొండిమాటలుతప్ప సున్నితములైన తార్కిక ప్రసంగములెందును గోచరింపవు. తనకు తానే యజ్ఞపశువుగా నూహించుకొనుచు దేవుడైనవాడు మరణించునని వేదములం దెందును గానరారు.

కాని హిందువుల వేదములలోనే ఆ విషయమై కలదని సైనికు లనుచుందురు. అట్టి పనికిమాలిన మాటలు వేదములం దెచ్చటను లేవు. ఇక వేదములలోని సత్యమరయుదము

ఈ దృశ్యమగు బ్రహ్మాండము ఒక జడపదార్థము. అయినను దానికి విరాట్ పురుషుడను నామము కలదు. ఆ విషయము పురుష సూక్తమునందు వర్ణింపబడి యున్నది. ప్రకృతియొక్క పరి

నామ స్వరూపమే యీ బ్రహ్మాండమని యెల్లర మెరుంగుదుము. జడమైయున్న బ్రహ్మాండమునకు పురుషుడు అను నామమున్నందున బ్రహ్మాండ రూపమున పరిణమించిన ప్రకృతికూడా ఒక విధంబుగ పురుషు డనబడును. వేరొక దృష్టితో ఆ బ్రహ్మాండమే స్త్రీగా గ్రహింపబడును. విచారింప ప్రకృతి-జడపదార్థమై యున్నందున దానిని నపుంసకలింగ మనుటయు న్యాయమే యగును. స్త్రీ పురుష నపుంసక రూపములం దెద్దియు కానిది పరిపూర్ణ పరబ్రహ్మమని వేదాంత శాస్త్రమున నిర్ణయింప బడెను. అందుకనియే ప్రకృతిని స్త్రీలింగముగను, పుంలింగముగను నపుంసక లింగముగను ప్రవచించు చుందురు. ఆంధ్రమహాభాగవతమున పోతనామాత్యుడు గజేంద్రునిచే ఏ రీతిగ దేవుని స్తుతింప జేసెనో ఒకమా రాలకింతము.

తే॥ స్త్రీ నపుంసక పురుషమూర్తియును గాక
తిర్య (పశువు) గమర (దేవ) నరాదిమూర్తియునుగాక
కర్మ గుణ భేద సదసత్ప్రకాశిగాక
వెనుక నన్నియు దానగు విభుదలంతు.

దేవుడు స్త్రీ పురుష నపుంసక మూర్తులలోనివాడు కాడు. పశువులకును, దేవతలకును, నరులకును సంబంధించిన వ్యక్తియై యుండడు. కర్మలం జేయు సత్వరజస్తమోగుణము లైనను ఆయన యందు లేవు. (సదసత్) సత్తు అసత్తు అనువానికి అతీతుడు కావున నా విభుని దలంతు ననుచు గజేంద్రునిచే ఆ భాగవతగ్రంథకర్త యగు పోతనామాత్యుడు పల్కించియుండెను.

పరిపూర్ణబ్రహ్మతత్త్వము స్త్రీపుంనపుంసకలింగములలో నొక్కటియు కాదని భావము. అట్టి దేవుని తత్త్వము సైనికుల కేమి తెలియును. ఈ సృష్టి యంతయు ప్రకృతినుండి వెలువరింపబడెనని యెరిగిన పిదప నా ప్రకృతిని స్త్రీ యనిగాని, పురుషుడనిగాని నపుంసకం బనిగాని నిర్ణయించుకొనుచు సమయానుకూలముగ స్త్రీ నుండి సృష్టి

*ల్గి యుండెననియు తెలుపవచ్చును. నపుంసక పదార్థము నుండియూ సృష్టిజరిగినదన వచ్చును. ఎద్దియైననేమి? అది యంతయు పరిపూర్ణ పర బ్రహ్మమై యుండెను. ఆ బ్రహ్మతత్త్వము సృష్టికి సంబంధించిన దియై యుండదని నిశ్చయించుకొనవలెను. ప్రకృతిని ఒకానొక బీజరూపమని వ్యవహరించితిమేని - బీజమునకు అండడండలుగా నుండిన దగుచు పరబ్రహ్మము జలరూపమున నుపకరించును. ఇక నా ప్రకృతియను బీజమునకు జలసంబంధమగుచల్లదనము తగిలినకారణ మున నాబీజము నానినదై మరియు నుబ్బినదై రెండుగాచీలును. అం తట నా రెండు చీలికల నడిమి భాగమునుండి మొలక యేర్పడును. క్రమ ముగ నా మొలకయే వృక్షముగా మారును. దానినే ప్రపంచ వృక్ష మనెదరు. బీజరూపముననున్న ప్రకృతి పరిపూర్ణ బ్రహ్మము యొక్క సాన్నిధ్యవిశేషమున నానినదై మరియు నుబ్బినదై రెండుగా బ్రద్ద లయ్యెనని వినియుంటిమి. అందుండి జగద్వృక్షము ఏర్పడెను. ఒక మారు ప్రకృతిని పురుషుడుగా నూహించి వ్యవహరింతము.

సృష్టి కార్యక్రమము ఒక మహాయజ్ఞముగా భావింపబడు నేని అట్టి యజ్ఞమున ప్రకృతి యనుపేరుతో వెలయుచున్న పురుషుడు వధింపబడవలసియుండును. పై విషయమై పాఠకు లీ సమ యమున అత్యంతమగు బుద్ధిబలము నుపయోగించి సత్యాన్వేషణ మొనరింపవలసిన యవసర మేర్పడును. బీజము అంకురింపవలెననిన- మొదట బీజము బ్రద్దలగునని యెరుంగనివారు లేరు. అనగా ప్రకృతి యను పురుషుడు సైతము బ్రద్దలుకావలెను. అనగా వధింపబడవలెనని యర్థము.

ప్రకృతియను పురుషుడు సృష్టిసంబంధమగు మహాయజ్ఞమందు హాతమయ్యెనని భావము. ప్రకృతి యను పురుషునకు మరియొకరీతిగ పురుష పశువు అనియువ్యవహార మేర్పడియున్నది. ఇదియంతయుసృష్టికి సంబంధించిన మహాయజ్ఞమని మరువరాదు. ఆ యజ్ఞమునసైతమం ఎద్దియో యొక్క పశువు వధింపబడవలెను. అంతకుపూర్వమా

సృష్టియే లేనపుడు సృష్టిస్వరూపమై వెలయు మహాయజ్ఞమందు వధింపబడుటకు పశువు లెక్కడివి ? అది యసంభవమగు విషయము. కావున ప్రకృతియే స్వయముగ పురుషుడను నామమునుపొంది పశువు అనియు వ్యవహరింపబడుచుండెను. ఆ ప్రకృతియే పురుషుడను పేరుతో వధింపబడుటయు న్యాయము కాకపోదు. ప్రకృతి సంహరింపబడెను అనినను పురుషుడు వధింపబడెను అనినను పశువు చంపబడెను అనినను అర్థ మొక్కటియే సుమా!

మన సైనికులు క్రీస్తుకు యజ్ఞపశువు అని వ్యవహరింప సాగిరి. ఆ రీతిగ కరపత్రములనున్న - పుస్తకములనున్న వ్రాసిరి. కాని వేదములోని వర్ణన మెంతమాత్రము ఏసుగారి విషయమై సరిపడుననరాదు. వేదమున వర్ణింపబడిన యజ్ఞమును గూర్చి యొక మారు గుర్తింపగలిగినయెడల పై విషయము బాగుగ నర్థము కాగలదు. కావున వేదమంత్రములం జూచి సత్య మరయుదము.

| | |
|---|---|
| పురుష ఏవేదగ్ం సర్వం | (ఇదగ్ం సర్వం) కనపడుచున్న యీ బ్రహ్మాండ మంతయు జడపదార్థమై యున్నను ఆ మాటను కట్టిపెట్టినద్దై దానిని |

(పురుష ఏవ) పురుషుడనియే వేదము హెచ్చరించినది. మరియు—

| | |
|---|---|
| యద్భూతం యచ్చభవ్యం (పురుషసూక్తం) | ఎయ్యది యింతకు పూర్వము సృష్టింపబడి యున్నదో యికముందును నిర్మింపబడనున్నదో అది యంతయు పురుషుడు అను నామముచే పిలువబడుచుండును. |

సృష్టింపబడినదానిని బ్రహ్మాండ మనియు, పురుషుడనియు వేదములనుండి గ్రహింపగల్గితిమి. లోకములన్నియు ప్రకృతినుండి వెలుపలకు వచ్చినవి. అనగా ప్రకృతియే బ్రహ్మాండరూపమున పరిణమించెనని భావము. ప్రకృతికి పురుషుడను నామ మున్నందున

ఆ పురుషునినుండి యీ లోకములు ఆవిర్భవించినవై అవి యన్నియును జేరి పశువు అను బిరుదమును సైతము పొందినవి.

అయితే పురుషుడనువాడు వేరొకడు లేడా? అను సంశయము కల్గును. లేడనికాదు ఉండియే యున్నాడు.

("ఉత్తమఃపురుష స్త్వన్యః) (గీత—)

ఉత్తమోత్తముడగు పురుషుడు (అన్యః) వేరొకడు కలడు. అతనినే పరమేశ్వరుడనెదము. జడమైయున్న ప్రకృతి పురుషుడై యుండెనను విషయమును మరువరానిది. అట్టి పురుషరూపమున వ్యవహరింపబడుదానిని అనగా పశువును సృష్టికి సంబంధించియున్న మహాయజ్ఞమున (అబధ్నన్) బంధించివైచిరి.

పశూశ్చ్రికే వాయవ్యాన్ { ఆ యజ్ఞమునుండి రకరకములైన పశువులు జననమందినవి.

ఆరణ్యాన్ గ్రామ్యాశ్చయే { అరణ్యమృగములును, గ్రామపశువులును సృజింపబడెను.

అటుపైనింకను మరెవరు జన్మించి యుండిరో తెలియుదము. బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్యులున్నూ మరియు ("శూద్రోఅజాయత") శూద్రులున్నూ జన్మించియుండిరని వేదమంత్రములందు జగత్సృష్టి విషయమై వర్ణింప బడెను. పురుషపశువు యజ్ఞమున వధింపబడిన యనంతరము— తన్మహిమచే లోకమున్నూ ఆ లోకములోని ప్రజలున్నూ సృష్టింపబడిరని వేదమూలమున తెలియగల్గితిమి. సృష్టిసంబంధమగు యజ్ఞము జరిగి నేటికి నూట తొంబదియైదు కోట్ల వత్సరములు పైగాగతించియుండెనని యెరుంగుదు. ఆయజ్ఞమునుండి జగమున్నూ అందలి పశ్వాదులైన జీవరాసులున్నూ వుద్భవించినవని యింతకుపూర్వమే వేదమంత్రముల మూలమున గ్రహించియుంటిమి. పశు పక్షి మనుష్య జాతులన్నియు సృష్టికాలమున జరిగిన ప్రకృ

యజ్ఞమునందు సృజింపబడినవని వేదప్రమాణములుండగా నా రహస్యమును గుర్తింపజాలక యజ్ఞపశువుగా నున్న యేసు వధింపబడెననియు తదనంతరమే జగమున్నూ జీవరాసులున్నూ సృష్టింపబడియుండె ననియు రుజువుచేయగల తెలివి ఆ సైనికులకుండెనా? తమ జీవితాంతమునకైనను ఆ రీతిగా నొనరింపజాలరు.

ఏసు వధింపబడిన దెంతకాలము క్రిందటనో తెలియుడు. షుమారు రెండువేలేండ్ల క్రిందటనే కదా! ఆయన వధింపబడిన యనంతరము ఆతని మహిమచే లోకమున్నూ అందలి పశు పక్ష్యాదులున్నూ మరియు మానవులున్నూ జన్మింపవలసి యుందురు. కాని అంతకు పూర్వమే సృష్టియంతయు జరిగిపోయినది. కావున వేదమునం దుదహరింపబడిన యజ్ఞప్రసంగమును ఏసువిషయమై యంటగట్టుట తెలివితేనితనము. ఇంకను తెలియందగిన రహస్య మొకటి కలదు. యజ్ఞములం జేయుటకై యెవరో కొందరు పెద్దలు అరువాలై యుందురు. అయితే విదేశమున జరిగియున్న యజ్ఞమునకు కర్తలెవ్వరని ప్రశ్నింతము. "పిలాతు" అను రోమను గవర్నరున్నూ, ఆదాము హవ్వల సంతతివారున్నూ చేరి ఆ యజ్ఞమును నిర్వహించిరనుటకంటె గత్యంతరము లేదు. అది నిజమైనయెడల నోటితో నవ్వగలవారుండరు. ఎందుకన యజ్ఞకర్తలు మహర్షులనియు, దేవతలనియు వేదమున వివరింపబడెను. ఆ ప్రమాణముం జూతము.

| | |
|---|---|
| దేవా యద్యజ్ఞం తన్వానాః | యజ్ఞములం జేసినవారు (దేవాః) దేవతలు అనియు |
| సాధ్యా ఋషయశ్చయే | మహర్షులు సైతము ఆ దేవతలతో చేరినవారలై యజ్ఞమును పూర్తిగావించి యుండిరనియు వేదమున హెచ్చరింపబడెను. |

అయితే మహర్షులన నెవరు? దేవతలన నెవరు? అను విషయమును గుర్తింపవలసిన యవసరము కలదు.

(ప్రాణావై ఋషయః) దేవదేవుని ప్రాణములనే మహర్షు
లనెదరు.

(యేదేవా మనోజాతాః) దేవుని మానసిక సంకల్పపరంపరలు దేవతలనియు వేదములలో వర్ణింపబడియుండెను. ఈ రహస్యముల నెరుగనివారు హిందుమత గ్రంథములను చదివినను చదువకున్నను ఒక్కటే. అయితే ఋషులుగాని దేవతలుగాని- ఈలోకమున వేరుగా లేకుండిరా? అని ప్రశ్నించుపుడు. ఆ దేవుని ప్రాణరూపముననున్న ఋషులు ప్రత్యేకముగ స్థూలరూపములం దాల్చి ఈ లోకమునకు విచ్చేసియుండిరి.అది నిజము.అదేరీతిగ దేవుని సంకల్పములు సైతము దేవతారూపములం బొందినవి. బాహ్యార్థమం దెప్పుడైనను సందర్భ శుద్ధి లేదని తోచినప్పుడు అంతరార్థమునకై యన్వేషించుచు దేవుని ప్రాణములై వెలయు ఋషులను జూచుకొనవలెను.

ఈ రీతిగ గ్రంథములం జదువనేర్వనివారు నలుగురిలో నగు బాట్లయ్యెదరు.

హిందువుల యజ్ఞమంత్రములోని కథకును, పాలిస్తానా లోని వధ్యశాలయందు వధింపబడిన యేసుయొక్క కథకును ముడిపెట్టి ఆ కథనంతయు సరిగా నడుపగల శక్తియైనను ఆ సైనికులకు లేకపోయె నని చింతింపవలసి వచ్చినది. వారి భాషణములు ముసలమ్మకథలతో పోల్చుకొన వచ్చును. ప్రొద్దుపోవుటకై యొకతావున గూర్చొని రాత్రికాలములలో మంచముపై పరుండియున్న ముసలమ్మ చిన్న చిన్న బాలురకుం జెప్పుచున్న కథలవలె నుండునని భావము.

ఒక ముసలమ్మ తన యింటిని ఊడ్చుకొనుచుండగా ఆకసము తన నెత్తిపై కెక్కి తొక్కినటుల దృశ్యముకాగా ఆగ్రహము కలిగి ఒక బాలికయొక్క మలమును చేతగైకొని పైకి విసరివేసెనట. అంతట వా దుర్గంధమును భరింపలేక యాకసము క్రమముగా పైకి పోయెనట. ఇట్టి కథకును, సైనికులచే బోధింపబడు యజ్ఞపశువు యొక్క కథకును పరిపోయియుండును.

ఈ రీతిగ పిచ్చిపిచ్చి మాటలం జెప్పుచు నెంతకాలము ప్రజలను మోసగించగలరు? క్రైస్తవమత ప్రచారములోని ప్రసంగము లన్నియు నిదే రీతిగా తలయును తోకయును లేనివియై యుండును.



—: ఏసుగారి మరణము :—

ఇకమీాద యేసుయొక్క మరణవిషయమై గమనింతము. ఆయనను సిలువపై నుంచినవెంటనే జనులయందొక కల్లోల ముదయించెను. ఏమనగా "ఓయీా! ఏసూ! నీవు దేవుని ప్రియకుమారుడ వయియుంటివి. ఒకమారు నీతండ్రిని ప్రార్థింపరాదా? నీ మొర లాలకించి నిన్ను కరుణించునేమో! ఆయన కరుణించినయెడల వెంటనే సిలువపైనుండి నిన్ను దింపివేయును కదా!" అని హెచ్చరించిరి. అంత యేసుగారి ప్రత్యుత్తర మీా క్రిందివిధముగ నుండిన బాగుండును. "ప్రజల పాపములను నా శిరముపైనుంచుకొని ఆ పాపభారమును భరింపజాలక మరణింపవలయునని తలంచితిని. నా తండ్రియు ఆ కార్యము నెరవేర్చుటకే నన్నిచ్చుటకు బంపెను. కావున నాతని యాజ్ఞను ధిక్కరించగలనా!

ప్రజలారా! వినుడు.

1. నన్ను విడుదల చేయమనుట మొదటితప్పు.

2. నా ప్రార్థనల నాలకించిన నా తండ్రి నన్ను సిలువపై నుండి క్రిందకు దింపుట రెండవ తప్పు.

తండ్రి కుమారుల మిరువురము చేరి యీా రీతిగ తప్పులం జేయుచు వ్యవహరించగలమా! నేను తప్పుడు మార్గమున నడచియున్నయెడల జనులు తమ పాపములనుండి విడివడి పరలోకరాజ్యమునకుం బోవుటెట్లు? నా రక్తము చిందింపక యొక నిముషమైనను నిలువజాలను. ప్రజలారా! మీావాక్యము లాలకించి దేవుని ప్రార్థిం

చుచు నా శపథమును పరిత్యజించగలనా? వెంటనే నన్ను మరణింపనిండు. నన్నింతమాత్రము నిర్బంధింపకుడు. మీరెల్లరు వెనుకకు మరలిపొండు" అనుచు ఏసుగారు తెలుపవలసియుండెను. ఆరీతిగ వ్యవహరించెనా? లేదు. తాను తన రక్తమును చిందింపజేసినగాని ప్రజలకు విముక్తి కలుగనేరదని పలుమారు పలికియుండియు తన మాటను తాను నిలుపుకొనలేకపోయెను. కనుకనే అతడీ క్రిందివిధముగ దేవుని ప్రార్థించియుండెను.

"తండ్రీ! ప్రజలపాపములకై మరణింపుమని నన్ను పంపితివి. అందుకుసమ్మతించియే యీతావునకు రాగల్గి యుంటిని. కాని యీ వధ్యస్థలమునున్నూ మరియు నీబందిపోటుదొంగలనున్ను గాంచి భీతిల్లుచున్నాను. ప్రజలెటులబోయి నాకేమి? సిలువమీదనున్న నన్ను నీమహిమచే విడిపించుటకుగాను ఈ నా బంధములను విడిపింపుము. అవి తమంతట తామే సడలిపోయినయెడల నీప్రజలెల్లరు నన్నునూ నిన్నునూ బాగుగ విశ్వసింపగలరు. అదిమొదలు వారెల్లరు భక్తులై యుందురు దేవా! ఆలస్యమొనరింతువేల? నన్నీతావున నుండనీయక నీహస్తములతో గ్రక్కొని "ఇతడు నా ప్రియపుత్రుడని" పల్కుము. అంతట లోకమంతయు మనయిరువురి మహిమ గుర్తింపగలదు."అను భావమును వెల్లడింపగల వాక్యములతో తనతండ్రిని వేడుకొనెను. పైకారణములచే నాయేసుగారు జనులను మోసగించినటులయ్యెనా లేదా? విచారింప నొకానొక దేశమునకు మతప్రవక్తయై యుండియు– నొకమారు తన రక్తమును చిందింతునని తెల్పియును మరియొక సమయమందు రక్తమును చిందించుట కిష్టపడక "దేవా నన్ను సిలువపైనుండి దింపుమని ప్రార్థించెను. మతప్రవక్తయొక్క లక్షణమిదియేనా బాబోలు! ఈ విషయములన్నియు నాలకించిన పిదప నెవరిహృదయములు దద్దరిల్లక శాంతముగ నుండగలవు? రోషమును కల్గించుచున్న పరుషవాక్యములు ప్రజలనుండి వినవచ్చుచున్నను ఏసుగారికి సత్యదృష్టి యలవడినదికాదు. ప్రజ లేరీతిగ వ్యవహరించిరో వినదగును. ఆ మాటలు ప్రాణాంతకములై యున్నవనిన నయ్యది నేరము

కానేరదు. మరియు నా వాక్యములు నీతిగల్గిన ప్రతివ్యక్తిని రెచ్చ గొట్టు విధముగనుండెను.

—: సిలువపైనున్న ఏసునుగురించి ప్రజల హెచ్చరిక :—

ఆమార్గమున వెళ్ళుచుండినవారు తలలూపుచు "దేవాలయమును పడగొట్టి మూడుదినములలో కట్టువాడా! నిన్ను నీవే రక్షించుకొనుము. నీవు దేవుని కుమారుడవైతే సిలువమీదనుండి దిగు"మని చెప్పుచు ఆయనను (ఏసును) దూషించిరి.

మత్తై సువార్త - 27 అ 39 నుండి.

ఇంకను వినుడు.

"ఇశ్రాయేలు రాజుకదా! ఇపుడు శిలువమీదనుండి దిగిన యెడల వానిని నమ్ముదుము. వాడు దేవునియందు విశ్వాసముంచెను ............ ఆయనతో కూడా సిలువ వేయఃడిన బందిపోటు దొంగలును అలాగే ఆయనను నిందించిరి.

మత్తై - 27 అ. 42 నుండి.

పాపములను నశింపజేయుటకై మరియొక సాధనము కలదని ఏసుగారికి తెలిసినదికాదు. అందువలననే ప్రజల పాపములను ప్రత్యేకముగ సంహరించుటకు మారుగా - తానే స్వయముగ మరణింతునని యేసుగారు ప్రవచించియుండిరి. బైబులునం దెందుగాంచినను-తాను మరణమునుండి తప్పించుకొనుటకై యత్నించినట్టి జాడ లెన్నియో దృశ్యమగుచున్నవి. కాని తన శపథమును తాను నిల్పుకొనలేక పోయెను. మీదు మిక్కిలి చావునుండి తప్పించుకొనుటకై సిలువపై నుండి తొలగింపుమని దేవుని ప్రార్థించియుండెను. తన జీవితమున కదియెంతయో కళంకమనియు గుర్తింపలేకపోయెను. తనకు మృత్యువు రానిరీతిగ ననుగ్రహింపుమని ప్రార్థించెననుటకు ప్రమాణము లున్నవాయని సంశయింపకుడు. ఈ క్రింది భాగమున వానిం జూడ గల్గుదుము.

"అక్కడ నిలచియున్నవారిలో కొందర మాటలు విని - ఇతడు ఏలీయాను ప్రార్థించుచున్నాడనిరి. తక్కినవారు ఊరకుండి ఇతనిని ఏలీయా రక్షింపవచ్చునేమో చూతమనిరి."

అందలి భావమును చూతము.

నిన్ను విడిపించుటకుగాను నీ తండ్రిని ప్రార్థింపుమని ప్రజలు హెచ్చరించినపుడు అందుకు సమ్మతించియే ఏసుగారు తన తండ్రిని వేడుకొనుచుండెను. దీనింబట్టి ఏసుక్రీస్తుకు జీవింపవలెనను వాంఛ కలదని అర్థమగుచున్న కారణముననే "ఇతడు నిన్ను రక్షించునేమో చూతమనిరి. కావున ఏసుగారికి ప్రాణములపై తీపి యున్నదనియే నిశ్చయింపగలము. ఏసును గురించి ప్రజలలో నెట్టిఘనమైన భావములున్నవో పాఠకులకు తెలియనిదికాదు.

ఈ విషయమై మన సైనికు లేమనెదరో చూతము. మా యేసు ప్రభువు మరణమునుండి తప్పించుకొనుటకు యత్నించి యుండలేదు. తనంతట తానే శత్రువులకు అప్పగించుకొనెను. అట్టిపురుషుడు తనను శిలువపైనుండి దింపుమని ప్రార్థించియుండడు. ఆ దివ్యపురుషుని యందు లేనిదుర్గుణమును ప్రత్యేకముగ నారోపించుట మాత్రము తగినపనికాదు- అని వాదించుచుందురు. ఎన్నివిధములు బోధించి యున్నను ఆ సైనికులు సత్యమును గుర్తింపజాలరైరి. రాణువవారు తనను పట్టుకొనుటకై వచ్చినసమయమున తనకు మరణమగునంతగా బాధకలెగెననియు - తనకు సంభవింపనున్న శిక్షాసమయము (గడియ) తప్పిపోవలెననియు తన తండ్రిని ప్రార్థించియుండెనని బైబులునుండి ఆయా వాక్యములను దర్శించియుంటిమి. "దేవా! ఈ తావుననున్న గిన్నెను కదలింపుము.

అది యే కొంచమైనను తొలగినయెడల నీవు నన్ను సిలువ మీదినుండి తొలగింతువని విశ్వసించెదను." అని వేడుకొనెనా లేదా! తనకు సంభవించిన కష్టములనుండి తప్పించుకొనుటకై సిలువపైనుండి తన తండ్రిని ప్రార్థించెననక తప్పదు. దేవునకు తనయందు కరుణ

కేకలుగనుందున అయ్యో దేవా! నన్నేల చెయి జారవిడిచితివనియు బిగ్గరగా కేకలు వేసెనని బైబిలునుండి ప్రమాణముల సైతము చూపించియుంటిమి. ఆ వచనములు వారి శిరము లోనికి జేరినను ఎరుగనివారి చందమున వ్యవహరించెదరు. అది మొండితనమై యుండునని జ్ఞులు తెలుపకపోరు. క్రీస్తుయేసు తనరక్తమును చిందింతునని చెప్పిన మాట నిజము. మాటిమాటికి దానినే చూపుచు మా ప్రభువు మరణించుటకు సిద్ధమై యుండెనని పల్కిన నేమి లాభము! ఆయనను సిలువపై నెక్కించుటకు పూర్వము జరిగియున్న విషయము సిలువపై జేరిన యనంతరము మారిపోయినదని వారలెరుంగకుండిరా. అయిన నేమి! దానిని కప్పిపుచ్చెదరు. "దేవా నన్ను రక్షింపక యేల చెయి జారవిడచితివి" అను దానిని ఏల దాచియుంచిరో వారి దేవునకే యెరుక. బిగ్గరగా కేకలు వేయుచు ప్రాణములు విడచెనని బైబిలునందు లేదు కాబోలు. ఆ విషయమై మత్తైమార్కు మున్నగు సువార్తకర్తలుకూడ వ్రాయక విడచినవారుకారు. వాని నన్నిటిని పఠించియు తెలియనివారి చందమున జంకుచెందులకు! మితిమించిన దౌర్జన్యమునకు పూననగునా! ఇంతకును సైనికులకున్న స్వభావమును ఆ క్రైస్తవులు పోనిచ్చినవారుకారు. తన తండ్రి తనను రక్షించునని యేసుగారు భావించియుండిరి. కాని రక్షణమునకై సూచన లెవ్వియు లభించినవికావు. అంతట విసిగి వేసారి తుది వాక్యము నొకదానిని యుచ్చరించుచు తన ప్రాణములను లోనికి బిగపట్టి మరణించెనా యున్నటుల ప్రదర్శించి యుండెను. అందుకుం దగిన ప్రమాణము కలదు.

"ఏలీ ఏలీ సబక్తానీ" అని బిగ్గరగా కేకవేసెను. అనగా నా దేవా! నా దేవా! నన్నేల చెయి విడచితివి అని యర్థము.

మత్తై 27అ-46 నుండి

పై వాక్యములననుసరించుచు మరిమరి గమనింతుమేని ఆయనను దేవు డెంతమాత్రము రక్షింపక విడిచివేసెనని నిశ్చయింపవలెను.

స్వారాజ్యము నభిలషించు సమయమున దేశనాయకులలో ప్రముఖులైనవా రెవ్వరును ఉరిశిక్షను తప్పించుకొన నెంచినవారు లేరు. తుపాకిగుండుతో తనను కాల్చుడని ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారనిరి. ప్రభువుల కెదురుగ నిలువబడి తన రొమ్మును చూపియుండెనని వారివిషయమై యెల్లర మెరుంగుదుము. ఏసుగారు ఆమాత్రమైనను ధైర్యమును ప్రదర్శించినవాడు కాడు. తాను మరణింపక బ్రతికియుండవలెనని యభిలషించిన కారణమున రక్తమును చిందించుట కిష్టపడకపోయెను. ఇది యంతయు నసత్యమనెదరు మన సైనికులు. తనను పట్టుకొనిపోవుటకై రాణువవార లరుదెంచినపుడు ఏసుయొక్క ముఖచర్యలో నొకింతమచ్చ గోచరించెను. అనగా దుఃఖము పొంగిపొంగి పొరలుచునుండెను. ఆ విషయమై వినుడు.

చింతాక్రాంతుడగుచు తన ప్రాణములు మరణమగు నంతగా దుఃఖసాగరమున మునిగెననియు, మరియు కొంత దూరము సాగిపోయి నేలమీదపడి తనకు విధింపబడిన శిక్షను తప్పించుకొన నెంచుకొనెననియు, అందుకనియే తనతండ్రిని ప్రార్థించెననియు తెలియగల్గితిమి. ఆ త్మ ర క్ష ణ కై శిష్యులంగాంచినాశరీరము మాత్రము మరణమునకు తట్టుకొన జాలకున్నది. ఎందుకన తగినంతబలము నాదేహమున లేదు. అనియు తెలిపియున్నాడు.

దీనింబట్టి యైనను తాను మరణించుట కిష్టపడియుండడని యర్థము చేసికొనకుందుమా!

సముద్రతీరమున చేపలం బట్టుకొని జీవించుచున్న పల్లెవారలు తప్ప ఒక్కరో లేక యిద్దరో లేక ముగ్గురో నగరములోని పెద్దలైనవారు గాక ఆ దేశములోని యితర జను లెల్లరును ఏసువిషయమై మంచి భావమును కలిగినవారలు కానేరైరి. కనుకనే ఆయనను ప్రభుత్వమునకు పట్టించియుండిరి. ప్రాణముల నుగ్గబట్టుకొనుటకు అను విధము సాధించినట్టి వ్యక్తియైనందున ప్రాణములను లోభాగమున

నేదో యొకమూల నిబ్బుచు నీక్రింది విధముగ తుదిపల్కులు పల్కెను.

దాని నాలకింపుడు.

ఏల చెయిజారవిడిచితివి దేవా?యనియుచ్చరించుచు తానంతకు పూర్వమే యభ్యసించిన యోగబలముచే నాడీచలనమును లేకుండ జేసికొనెను. ఆ మర్మము నెరుంగనివారు ఏసుయొక్క ప్రాణములు పోయెనని యెంచిరి. అది సహజమేకదా! ఇది యంతయు సిలువపై నున్నపుడు జరిగిన గాథ. పోనిండు. ఆ సిలువమీద నిల్చియున్న సమయమున ప్రాణములు పోవునంతపని యెద్దియైనం జరిగియుండెనా? అదియు సంభవించినదికాదు. కణతలయందో గుండెలయందో మారె చ్చట నైనను ఆయువు పట్టుగల తావులయందు మితిమీరిన దెబ్బలు తగిలియున్న యెడల మరణించి యుండును. అట్టి దెబ్బ లెవ్వియు తగిలి యుండినవికావు. ఇక ప్రాణము లెటుల నెగిరి పోవును? ఈ విష యమును బాగుగ నర్థము చేసికొనగల తెలివియున్నచో, అట్టి మహా నీయులు ఏసు విషయమై ముచ్చటించు నపుడు అతడు నిజముగ మర ణించి యుండడని నిశ్చయింప గలరు. ఈ రీతిగ విమర్శింప గలవా రున్న యెడల-మరియు నీ సువార్తను దేశమునందన్ని ప్రాంతము లలో వ్యాపింపజేయగల దివ్యమగు ప్రచారమును గావించు ధీరవరు లున్న యెడల-మన దేశమున క్రీస్తుమత ప్రచార మనునది స్వప్న వార్తయై యుండకపోదు. నిజముగ మనము జన్మించిన దెందులకు? మన భారతమాతయొక్క కన్నీటి బిందువులను తుడిచివేయుటకు కాదా? మనతల్లి వివిధ కష్టముల ననుభవించుచు - తన సవతి పిల్లల యొక్క దౌష్ట్యమును గాంచి-సహింపలేక నల్లాడుచుండెనే! మన తల్లికి నవమానము కలుగుచున్నను-పౌరుషహీనులమై వివేక శూన్యు లమై-ధర్మదూరులమై బ్రతుక నగునా! తల్లిని పరులపాలొనరించు టకు సిద్ధమైయున్న బిడ్డలంగాంచి తల్లి ప్రాణము లేమగునోయని తీతిల్ల నవసరములేదా! అందరము కలిసియుందముురండు. బిరబిర ధర్మవీరులమై పరుగులిడుదము లెండు.

"లేరా! భారతవీరా!"

యని పాడుకొనుచు వేవేగ-

గమ్యస్థానమునకుం జేరుట కెందు

దేవతాబృందములారా మీరాయుండను-నిల్చియుండనిండు.

ఏసుగారిని ఆ సిలువ మీదనే నిల్పి కాళ్ళను చేతులను గొలుసులతోడనో తాళ్ళతోడనో బంధించి యుండిరి. అంతమాత్రమున ప్రాణములు పోవునని యెవ్వరనగలరు.

"మరియు యితడు యూదుల రాజయిన యేసు అని ఆయన మీద మోపబడిన నేరమును వ్రాసి ఆయన తలకుపైగా నుంచిరి. మరియు కుడివైపున నొకడును ఎడమవైపున నొకడును-బందిపోటు దొంగలు ఆయనతోగూడ సిలువ వేయబడిరి." అనుచు బైబిలు నం దుదహరింపబడెను.

మత్తై 27అ-37నుండి

పై విషయ మంతయు బైబిలు వెల్లడించెను కదా. ఏసుగారిని సిలువపై నుంచినపుడు-దెబ్బల గొట్టిరనిగాని పొడిచిరనిగాని ఆ బైబిలు ఏ పుటయుందైనను వివరించి యుండక పోయెను. విషయ మిటులుండ-సిలువపైనున్న ఏసుగారి ప్రాణము లెటుల బోయి యుండును. అసలు-సిలువపై నుంచిన దెందులకు. దానిపైననే నిల్పి చంపుటకు కాదు.

సిలువపై నుంచబడిన వారెవ్వరును ఆ తావుననే మరణింపరాదని ఆ కాలపు రాజ్యాంగము భావించి యుండెను.

యోగప్రభావమున ఏసుగారి గుండె స్పైతము కొట్టుకొనక యే నిల్చిపోయినది. ఆ స్థితిలో-అజ్ఞుల కేమి తెలియును. మృతుడట్లే భాసించును. అసలు జరిగిన సత్యవృత్తాంతమూ-ఇంతకు మించినది వేరొకటి లేదు.

పాఠకమహాశయులారా! ఉన్న కిట్టుకంతయు నిండే యిమిడి యున్నది. ఇట్టి సమయమున వివేకులు బుద్ధి బలమును వినియోగించు కొనవలెను. ఇక బుద్ధిని లోనికి దింపి విమర్శింతము. సిలువపై నున్న ప్రభు యేసును చంపివేయుటకు జరిగిన పను లెవ్వియు గోచరించినవి లేవు. అయినను ఒకమారు చర్చించి చూతము.

"అప్పుడతడు (పిలాతు అను గవర్నరు) ప్రజలు కోరి నట్లు బరబ్బాను (ఇతడొక బందిపోటు దొంగ) వారికి (ప్రజ. లకు) విడుదలచేసి, "పిలాతు" యేసును కొరడాలతో కొట్టి "సిలువ వేయ నప్పగించెను."

(మత్తయి 27అ-27వచ)

పై వాక్యములలో కొరడా దెబ్బలు అని వ్రాయబడినది.

సిలువపై నెక్కుటకు పూర్వమే కొరడా దెబ్బలం గొట్టిరి. అందుచే పైనున్న చర్మము మాత్రము గాయములం బొందును. దేహముయొక్క లోపలి భాగమున నున్న ఎముకలకును, కండరముల కును బాధ లెవ్వియు కల్గియుండె ననజాలము. కావున నా దెబ్బల మూలమున ప్రాణము లెంతమాత్రము వెడలిపోవుననజాలము. దెబ్బలం దినిన పిదప ఆయనను మెల్లగా సిలువపై నెక్కించి యుండిరి.

సిలువమీాద-ఇంకను మరెవ్వరైన నుండిరా? లేకేమి. ఆయనకు రెండుప్రక్కల యందును బందిపోటు దొంగలుండిరి. వారిం జంపిన యనంతరము మత ప్రవక్తను జంపనెంచిరి. ఆ క్రమము నేటి క్రూరత్వమునుజ్ఞప్తికిం దెచ్చుచున్నది. దొంగలను మాత్రమే కాళ్ళను విరగగొట్టి చంపివేసిరి.

ఈ విషయమై ప్రమాణములం జూతము.

ఆ దినము సిద్ధపరచు దినము. మరుసటి విశ్రాంతి దినము. మహాదినము. కనుక ... ... ... ఆ దేహములు విశ్రాంతి దినమున

సిలువ మీాద ఉండకుండునట్లు వారి (ఆ దొంగల) కాళ్ళు విరుగ గొట్టించి-వారిని (ఆ స్థలము నుండి) తీసివేయించుమని యూదులు పిలాతును అడిగిరి. కాబట్టి.........................సిలువ వేయబడిన దొంగ యొక్క కాళ్ళను మరియు రెండవవాని యొక్క కాళ్ళను విరుగ గొట్టిరి. యోహాను 19అ-31వచ.

కాళ్ళను విరుగగొట్టిన యనంతరము దొంగల యొక్క ప్రాణము లెగిరి పోయినవి.

సిలువపైన ఉండకుండునట్లు దొంగలను క్రిందికి దింపి కాళ్లను విరుగగొట్టిన యనంతరము వారలు ప్రాణములు బాసిరి అని తెలియ గల్గుదుము.

కాళ్ళను విరుగగొట్టిన యనంతరమే దొంగలు మృతులైరి. సిలువపై నున్న సమయమున వారు మరణించియుండ లేదు. ఎందుకన సిలువపై నున్నవారు మృతులై యుండరాదని ఆదేశ ప్రజలకుం దెలియును.

పాఠకులారా! దీనింబట్టి యేసుగారు సైతము సిలువపై నున్నపుడు-మరణించి యుండడు. మరణించెననుటకుం దగినచర్య లెవ్వియు జరిగియుండినవి లేవని-ఇంతకుముందే వివరింప బడెను. ఆ కారణముల నన్నిటిని పూసగుచ్చినటుల నొక తావున జేర్చుకొనుచు నీ గ్రంథమును పఠింపుడు. సారాంశమున-నా మహనీయుడు యోగబలమును కల్గి యున్నవాడగుటచే-సామాన్య మానవుల రీతిగా నుండక-ప్రాణములం దాచగల్గి యున్నాడని నిశ్చయించుకొన వలెను.

"ఏసుగారు తలవంచి తన ఆత్మను అప్పగించెనని"

(యోహాన్-19అ-30వ)

యుండగా—ఆయన మరణించుట కిష్టపడలేదని తెలుప నగునా! అని కొందరు ప్రశ్నింతురు. ఆత్మను అప్పగించితినని తెల్పిన మాట

నిజము. కాని అటుల దెల్పియు మరికొంత సేపటికి - తన భావమును మార్చుకొని జీవింప నలెనని యభిలషించెను. కనుకనే తన తండ్రిని ప్రార్థించియు తనకెంత మాత్రము సహకరింపని కారణమున యోగ బలముచే తన యాత్మను లోపలి భాగమున నెందో యొక తావున నిల్పి-దేహమునకు సంబంధించినదిగా నుండనీయక మరుగు పరచిన వాడగుచు దేవా! ఏల చెయి జారవిడిచితివని కేకవేసి-తన లోపలి భాగముననే నిల్చిపోయెను. ఇక మరణ మెక్కడిది?

మృతుడైనమాట నిజమేని-యీ క్రింది వాక్యములం జూచి-సత్యమరయ వచ్చును.

> "అంతకుముందే ఆయన మృతిపొంది యుండుట చూచి ఆయన కాళ్ళు విరుగగొట్టలేదుకాని-రాణువ వారిలో ఒకడు ఈటెతో ఆయన ప్రక్కను పొడిచెను. వెంటనే రక్తమును నీళ్ళును కారెను."

(యోహాన్ 14అ.33నుండి)

జంతువులను కోసి అందలి మాంసమును దినువారుందురు కదా. వారి నడుగుదము. చనిపోయిన పిదప-రక్తము ప్రవహించదనియు గడ్డకట్టినదై మంచుగడ్డవలె నగుననియు వచింతురు. ఆ మాంసపు కండలను కోసి-కూరగాయలరీతి వండుకొని భుజింతుమనియు దెల్పుదురు. ఆ కండలను కోయుచున్నపుడు అనగా శవముగానున్న జంతువుయొక్క మాంసమును కోయుచున్నపుడు—ఆ దేహమునుండి రక్తముగాని-నీరుకాని-కారదనెదరు. ఈ ప్రసంగము నిజమో కాదో మాంసభక్షకులగు మిత్రుల మూలమున తెలిసికొన వచ్చును. సిలువపై నున్న సమయముననే ఏసు\రు మరణించిరికదా. దొంగల కాళ్ళను విరుగగొట్టి చంపివేసిన యనంతరము ఏసుగారిని క్రిందికి దింపిరి. మరియు సమాధి లోనికి బంపుటకు యత్నించు చుండిరి. అతనిని తీసికొని వెళ్ళుదురు యని యెవరో యొకరు శసిపోక-ఈటెతో

పొడవగా రక్తమున్ను మరియు నీరున్ను కారెను. చనిపోయిన దేహమును అనగా శవమును పొడిచినపుడు రక్తమున్నూ మరియు నీరున్నూ యేరీతిగ బురబుర వెలుపలకు వచ్చును? అది లోకానుభవమునకు విరుద్ధము. ఎచటనో కొంత రక్తము దాగియున్నదనియు కావున గడ్డకట్టియున్నది కాదనియు తెలుపుటకు యత్నించినను ప్రయోజనము లేదు. ఎందుకన ఆయన బ్రతికియే యున్నాడు. కనుకనే రక్తము స్రవించినదని తెలిపిన నెంతయో సబబై యుండును. సిలువపై నుంచబడినపుడు మరణించుట కెవ్వియు మార్గములు లేకపోయెనని యింతకు పూర్వమే గ్రహించియుంటిమి. కావున ఆయనకు మరణము వచ్చియుండె ననరాదు. జీవించియే యుండెనని తెలుపుట న్యాయబద్ధమగు విషయము మొండితనముతో వాదించువార లుందురేని వారిని తృప్తిపరచుటకై యత్నించువా రుండరు. మరణింపలేదని రుజువుచేయబడిన విషయములే విజ్ఞులగువారికి చాలును.

మరణించియున్న యేసుప్రభువు మూడుదినముల యనంతరము లేచియుండెనా. లేదా? మానవు లెవ్వరైనను లేవగలరా? కావున మా మతప్రవక్త సాక్షాత్తు దేవుడే యనుచు కొందరు వాదింపగలరు. కాని వారి వాదము బలహీనమయినది. ఎందుకన హిందూదేశమున మృతులైన నరు లెందరో మరల బ్రతికినవారలుండిరి.

భాగవతమున జూతుమేని మృతుడైన కచుడు భస్మమైపోయిన పిదప మరల బ్రతికెనని విందుము. ఈ గాథను హిందువు లెల్లరు తెలిసికొనియే యుండిరి. సావిత్రీనోములు అనునవి స్త్రీలచే ననుష్ఠింపబడుచుండును. ఆమెయొక్క భర్త సత్యవంతుడనువాడు మరణించగా ఆ పతివ్రత తన పాతివ్రత్యమహిమచే నతనిని బ్రతికించుకొనెను. దేవకీదేవియొక్క పుత్రులు ఆర్గురు పసిపాపలై యున్న సమయముననే కంసునిచే చంపబడిరి. అయినను కొన్ని వత్సరములు గతించిన పిదప నా బిడ్డలను శ్రీకృష్ణభగవానుడు బ్రతికించి తన తల్లి కర్పించెనను విషయమును భాగవతమున దర్శింపగల్గుదుము. సాందీపమహర్షి

యొక్క పుత్రు డెన్ని వత్సరముల క్రిందటనో చనిపోయియుండినను శ్రీకృష్ణపరమాత్మ తాను పండ్రెండేండ్ల బాలుడై యున్న సమయమున సాందీపపుత్రుని బ్రతికించి యీ మహాత్మ్యన కర్పించి యుండెను. రామదాసుగారి చరిత్రను వినని హిందువు లుండరు. ఆ భక్తుని పుత్రుడు మరణించియుండగా నా విషయమై దిగులొందక శ్రీరామచంద్ర భగవానుని స్తుతించుచుండెను. దైవానుగ్రహమువలన మృతుడైన బాలుడు మరల లేచినవాడగుచు నాడుకొనుచుండెను. ఆనాడా తల్లిదండ్రు లెంతగ నానందించియుండిరో వర్ణింపగలమా! ఈ రీతిగ మృతినొందిన పిదప మరల జీవించియున్న వ్యక్తులయొక్క కథలను మరెన్నియైనను వినిపించవచ్చును. హిందువుల చరిత్రముల నన్నింటిని జదువగలవారున్న యెడల మరెందరో మృతులైన పిదప మరల బ్రతికినవార లుందురని తెలియగలుగుదురు. నిజముగ జన్మింపనెంచిన యెడల హిందుమతముననే జన్మింపవలెను. అంతకు మించియున్న మతము ప్రపంచమం దెందును గానరాదని డిండిమధ్వనులను మ్రోగింపవచ్చును. అయితే నిజమైన హిందువుల కది సుసాధ్యము. తానుయే మతమున జన్మించియుండెనో ఆ మతమున నున్న పరమరహస్యమును తెలియక జీవింపనగునా!

క్రీస్తుయేసు సమాధియందుంచబడినను మూడవనాడు తెలవారుజామున లేచి తిరిగె ననుచుందురు మన సైనికులు. దాని నెవ్వరును కాదనజాలరు. అందలి మర్మమును దెలియుదము. ఏసును గురించి పల్కినవి నాలుగు సువార్తలు కలవు. వానిని రచించినవారు మత్తయి- మార్కు- లూకా- యోహాన్ అను నామములం గలిగియున్నారు. ఆ నలుగురు కూడా సమాధినుండి లేచిన ఏసుగారిని గురించి వ్రాసియుండిరి. వారియం దొకరు తెలిపినదానికిని, మరి యొకరు వివరించినదానికిని సంబంధ మెంతమాత్రము గోచరించు ననజాలము. అ రహస్యమును వినుడు.

-: మత్తయి - సువార్త లోని విషయము :-

ఆదివారమున

తెల్లవారుచుండగా (ఇరువురు స్త్రీలు)

|

చూడవచ్చిరి. 28 అ. 1 వచ.

ప్రభువు దూత — దిగివచ్చి (సమాధి గుహకు బంధించినట్టి)

|

రాయి దొర్లించి

|

దానిమీద కూర్చుండెను.

(28 అ. 1 వచనము)

పాఠకులారా! సమాధికి వెలుపలి విభాగమందు దొర్లించబడిన రాతి మీద ఒకే యొక దూత కూర్చునియుండె నను విషయమును మరువరాదని ప్రార్థన.

## మార్కు సువార్తలోని విషయము

ఆదివారమున—

సూర్యోదయ మైనపుడు (ఎవరోవచ్చి)

|

రాయి దొర్లింపబడి యుండుటను జూచిరి.

|

వారు సమాధిలో ప్రవేశించిరి.

|

ఒక యౌవనసుడు (ఏసుయొక్క) కుడివైపున కూర్చుండుట చూచి మిగుల విభ్రాంతి నొందిరి.

 చదువరులారా !

సమాధికి వెలుపలగా దొర్లింపబడిన రాతిమీద ఒక దేవదూత కూర్చొనియుండెనని మత్తయి చెప్పియుండగా_

సమాధిలో నొక యువకుడు కూర్చొని యుండెనని మార్కుగారు తెలిపిరి.

ఏది నిజము !

(16 అ. 3 నుండి)

 -: లూకా సువార్తలోని విషయము :- 

ఆదివారమున

తెల్లవారగా- (ఎవరో కొందరు వచ్చి)

|

రాయి దొర్లింపబడుట చూచి

|

లోపలికి వెళ్ళిరి. కాని...

|

యేసు దేహము వారికి కనబడ లేదు ... ... ...

|

ఇద్దరు మనుష్యులు వారియొద్ద

|

నిలువబడిరి." అని యున్నది.

(24 అ. 1 నుండి)

సత్యాన్వేషకులారా !

1. రాతిమీద దేవదూత కూర్చొనెనా?

2. ఒక యువకుడు సమాధిలో కూర్చొనిన మాట నిజమా ?

3. ఇద్దరు మనుష్యులు లోన కూర్చొనియుండిరి. అందలి సత్యము నెరుంగుడు.

యోహాన్ సువార్తలోని విషయము.

ఆదివారమున—

ఇంకా చీకటి వున్నప్పుడు (ఎవరో)

|

సమాధియొద్దకు వచ్చిచూడగా

| (వచ్చినవారిలో ఒకస్త్రీ)

ఏడ్చుచు

|

సమాధిలో వంగిచూడగా———

|

ఇద్దరు దేవదూతలు

|

తలవైపున ఒకడును

|

కాళ్ళవైపున ఒకడును కనబడెను.

(21 అ. 11 నుండి.)

ప్రియులారా!

1. ఒకే దేవదూత రాతిమీద కూర్చొనెనా.
2. ఒక యువకుడు సమాధిలో కూర్చొనెనా.
3. సమాధిలో కూర్చొనినవారు ఇరువురు దేవదూతలా లేక మనుష్యులా.
4. సమాధియందు-ఇద్దరుండిరా దేవదూతలు? అందెయ్యదినిజము?

ఆదివారమున - తెల్లవారుచుండగ - చూచిరా ?

|

సూర్యోదయమైనపుడు చూచిరా ?

|

తెల్లవారగా చూచిరా!

|

చీకటిగా నున్నప్పుడు చూచిరా?

వేరు వేరుగనున్న వారలు—వెళ్ళిన యెడల వారిలో ఒకరు చీకటి యున్నప్పుడును వేరొకరు తెల్లవారినపుడును మరియొకరు తెల్లవారిన పిదప సూర్యుడు ఉదయించినపుడును యింకొకరు తెల్లవారక మునుపు చీకటియున్నపుడును — వెళ్ళిరనిన యెడల సంశయించు వారుండరు. వెళ్ళినవారందరు- వేరువేరైన వ్యక్తులు కారు.

1. మగ్దలేనే మరియయు వేరొక మరియయు సమాధివద్దకు వచ్చిరి.

2. మగ్దలేనే మరియయు యాకోబు తల్లియైన మరియయు సలోమేయు- సమాధి వద్దకు వచ్చిరి.

3. ఒక పురుషుడున్నూ యెవరో యిరువురు స్త్రీలున్నూ సమాధికడకు వచ్చిరి.

4. మగ్దలేనే మరియయు- వచ్చెను సమాధికడకు.

సువార్త కర్తలలో ముగ్గురు కొంచెము మించుగా ఒకేరకమైన వ్యక్తులు వచ్చిరనిరి. లూకా అను సువార్తకర్త - ఆవిషయమై భేదించి యుండెను. సమాధివద్దకు విచ్చేసియున్న వ్యక్తుల విషయమై- పై సువార్తికులు భేదాభిప్రాయములం జెప్పియుండిరని గ్రహించితిమి. సమాధివద్దకు చేరియున్న సమయములు కూడా భేదించియున్నవి. సమాధివద్ద - రాయిని దొర్లించియున్నవారి విషయమునందున్ను - సమాధిలో కూర్చొనినవారి విషయమునందున్ను ఒకరిమాట వేరొకరికి సరిపడియుండలేదు. ఎవరియందెవ్వరును నిజమును గుర్తింపరైరి. ఎవ్వరెవ్వరో యూహాలంబెట్టుకొని-వారివారికిం దోచినటులెల్ల గ్రంథములను వ్రాసియుండిరని వేరుగ తెలుపవలసిన యవసరములేదు. పరిశుద్ధ గ్రంథమగు బైబులునందు - అసందర్భ ప్రలాపములతో నిండియున్న అపరిశుద్ధములగు వ్రాతలెంతో కున్నవో బుద్ధిమంతుల కర్థమగుట లేదు. కనులుమూసికొని గుడ్డిగా విశ్వసించువారికి మాత్రము - పరిశుద్ధ గ్రంథముగనే తోచును

క్షాబోలు! ఈరీతిగ నెన్నెన్నియో లోపములం బెట్టుకొనిన మతసైని
కులు - హిందుమతముపై దాడిని సల్పుచుందురుకో! సరిగా గెలువ
బడి - తమ మతమే యోగ్యమైనదనియు హిందుమతము నిజముగ
నయోగ్యమైనదనియు రుజువుచేయగలరా?

మహాశయులారా! తమ గ్రంథమును చదివినకొలది విషయము
లన్నియు యుక్తియుక్తముగను గ్రంథప్రమాణ బద్ధముగను ఉన్నవని
నిశ్చయింపగలము. కాని చిన్న సంశయం బొకటికలదు. ఇతర మతము
లలోని లోపముల నెత్తి చూపుచున్నపుడు ఆ మతమున నున్నవారి
మనసులకు కొంచెమైనను నొప్పికలుగదా? అని యూ సంశయము
అనుచు ప్రశ్నించుచుందురు. మతప్రచారకులున్న దెందులకు? తమ
మతమునందున్న సంశయములం దీర్చుటకు కాదా! కాంగ్రెస్ ప్రభు
త్వమునందు మెప్పలేమోలోపము ఉన్నదని ప్రజలందు భిన్నభావము
లుదయించునేమో యనుకొని ఆనాడు ప్రజలలో నడుమ నడుమ
వ్యాపించుచున్న సంశయములం తొలగింపజేయుటకు ప్రభుత్వము
రేడియోల మూలమునను - ప్రచారకుల మూలమునను - గ్రంథ
ప్రచారణముల మూలమునను సత్యచరితములం దెలియజేయుచు
నుండును. అటులనే అన్యమత ప్రచారకులు ఈ గ్రంథముం జదివి -
అందుదహరింపబడిన ప్రమాణములలోని రహస్యార్థములను తమ
ప్రజలకు వివరించుచు వారి సంశయములం దీర్చుటకు యత్నించితీర
వలెను. మరియు అన్యమతసహనమును సైతము నేర్పుచు తమ మత
మునందున్న గొప్పతనమును అర్థముచేయవలెను. లోపము లెవ్వి
యైనను ఉండునేని - వానింగూర్చి చింతింపక - శాంతముగ లోలోన
నిమిడించుకొనుడనియు ప్రబోధింపవలెను. మరియు

ప్రియమైన క్రైస్తవులారా! ఇతరమతములవారు మన గ్రంథ
ములలోనిలోపములను వివరించినపుడు మనకెంతయో కష్టము గల్గి
యున్నటుల భావింపమా? అన్యమతములవారలేమని నిశ్చయింపవలెనో
వినుడు. అన్యమతములలోని దోషములను వెల్లడించుటకై కరపత్రి
ముల మూలముననో ఉపన్యాసములమూలముననో గ్రంథముల మూల

మునసో వెల్లడించు సమయములలో హిందువులకును మానసిక బాధ ఘుదయింపవా యనుకొని అందుకు తగినటులవ్యవహరించినపుడే మన దేవుడుమనలను మన్నింపగలడని నచ్చచెప్పుటకుయత్నించుచున్న యెడల-మరియు నారీతిగ వ్యవహరించుటకు తమ చిత్తమును మార్చుకొనిన యెడల అనగా మనసునకు మార్పును కల్గించుకొనిన యెడల-దేవుడు సైతము సంతసింప గలడు అని బోధించు చుండవలెను. అన్య మతములవారు మన దేశమునకు వచ్చినదెందుకు? మన మతమును నశింపచేసి-తమ మతమును ఈ దేశమున నెలకొల్పుటకు కాదా. ఒక దేశపు మతమును మరియొక దేశమున స్థాపింపజూచుట అక్రమచర్య కాకుండునేమి? ఎందుకనెదరా? ఆయా దేశములు శీతోష్ణాది భేదముల ననుసరించి- భిన్న భిన్నముగ నుం డును. ఏ దేశమున నెయ్యేయ్యవి ఫలించునో వానిం దినువారల బుద్ధులున్న వానికిం దగిన రీతిగనే పరిణమించును. చలిచే బాధింపబడు చున్న ప్రజల బుద్ధులు—గుడ్డలం గప్పు కొనవలెనని ప్రేరేపించు చుండును.

ఉష్ణ దేశమున నివసించుచున్న జనులు అందలి వేడిమిని భరింప జాలరు. కనుకనే- గుడ్డలచే దేహమంతయు- బిగింపనెంచరు. శీతల దేశ వాసులు వేడిమిని కల్గింపగల ఆహారములం దినెదరు. ఉష్ణదేశీయులు చల్లదనమును పుట్టింపగల వస్తువులను సేవింతురు. వారి వారి మనసులకు ఆయామార్పులేల కలుగుచుండెను. దేశభేదముల ననుసరించికాదా? మనసులయొక్క-మార్పిడికి హేతువు- దేశములులైయున్నవి- అనియర్థమగుచుండెను హిందు దేశమున నివసించువారి మనసులు ఈ దేశమునకుసంబంధించినవిగా నుండవలెను. అంతియేకాని - ఏ పాలిస్తానా (ప్యాలెస్ టైన్ లోని ప్రజల భావములతో నేకీభవింపరాదు. పాలిస్తానాలోని ప్రజల మతులు - ఆ దేశమునకుం దగినరీతిగ వ్యవహరింపబడవలెను. కావున శీతల దేశవాసులకు ఆ దేశమున జననమందిన మత ప్రవక్తల బోధలు ఆచరణీయములు భారతీయులకో! భారత దేశమున నావిర్భవించిన మత ప్రవక్తల ప్రవచనములు ఆదరణీయములు. కావున నీ దేశమునకు హిందుమతమే శ్రేయోదాయకం

బగును. అట్టి మతమును నశింపజేయుటకుగాను - పాలస్తీనాలోని మతము యత్నించుచున్నదని యెరుంగుడు. పాలిస్తానా(ప్యాలెస్టైన్)కు సంబంధించి యున్న రోమన్ క్యాథలిక్ మతస్థు లేమనుచుండిరో వినుడు.

హిందుమతమునేగాక మరియు హిందుమత గ్రంథములనున్ను హిందు దేశమున నిలువనీయక తరిమివేయగలమని సభలలో తీర్మానించుకొని యుండిరి.

"వుయ్ హోల్డ్ దట్ హిందూయిజమ్ ఎండ్ హిందూ పురాణాస్ మస్ట్ డిసప్పియర్ ఫ్రమ్ దిస్ ల్యాండ్."

అనునదే ఆ తీర్మానము.

(వేదాంతకేసరి పత్రిక 1955 సం॥ డిశంబరు)

ఇదంతయు దేశద్రోహకర విషయము కాదా! హిందువులు ఆ వాక్యములను వినియున్నను తమ మనసులకు నొప్పిని కలిగించుకొనిరా! లేదే! ఆంధ్రక్రైస్తవులచే రచింపబడిన గ్రంథము లెన్ని లేవు? అని యన్నియు హిందుమతమును దుయ్యబట్టినవని యెరుంగుడు. అందలి కొన్ని గ్రంథములు సైతము ఈ గ్రంథకర్తవద్ద కలవు. విదేశీయులకు సంబంధించియున్న మతములు మన దేశమున నడుగిడినది గాక హిందువుల మతులను మార్చినవై కోట్లకొలది ప్రజలను తమ మతములలోనికిం దింపికొనియుండినవి. అది గర్భనిర్భేదక విషయము. మరియు చీము నెత్తురు లున్న వారెవరైనను - భరింపరాని సందర్భము. బ్రతికియుండియు జీవచ్ఛవములై మెలంగుటకుగాను సహకరింపగల చల్లని కోత.

ఆ స్థితిలో శేషించిన హిందూప్రజానీకమునకు మనోబాధలు కలుగకుండు నేమి? అందుల కేమందురు. వానినన్నిటిని కప్పిపుచ్చుచు నీ గ్రంథమున నుదహరింపబడిన న్యాయములగు ప్రమాణవాక్య

ములను ఖండింపలేక మా మనసులను మిక్కిలిబాధించుచు తమ ప్రజ లకువేమని హెచ్చరించుచుండిరో! బుద్ధిబల సంపన్నుల కెంతమా త్రము ఆ పని తగియుండదని నా మనవి.

క్రైస్తవ మత ప్రచారకు లేరీతిగ నెందరెందరు దినదినాభి వృద్ధిం గాంచుచుండిరో తెలియుడు. వారి మూలమున నెందరు తమ హిందుమతమును విడనాడి విదేశ మతమున జొరబడుచుండిరో సావధానులై యాకర్ణింపుడు. ప్రభుత్వమును నడుపుచున్న ఉద్యోగ స్థులుగాని- లక్షలాది ధనమును సమకూర్చుకొనిన-వ్యాపారస్థులుగాని భూస్వాములుగాని యొంటరిగ గూర్చొనినపు డీ గ్రంథముం జదువుచు నన్యదేశపు మత పప్రచార మూలమున హిందు మతస్థులెందరు తమ హిందూత్వమును నశింపజేసికొని తిగుదు మయ్యాయనుచు వీధి వీధుల వెంట దిరుగుచుండిరో గ్రహించెదరు గాక. క్రైస్తవ మతప్రచార మును గాంచినపుడెల్ల మనమత మేరీతిగ నశించుచున్నదో మరియు మన దేశమున కెవ్విధంబగు దుర్దశ సంభవించినదో యికమీాద మనవం శములలో జననమందిన వారలెందరెందరు- మతభ్రష్టు లయ్యెదరో- అందుకొరకే బిడ్డలం గనుచుంటిమని గ్రహించినంజాలు. న్యాయముం జెప్పగల కోర్టు మునసబులకును- జడ్జీలకును- మరి మరి ప్లీడర్లకును- సామాన్య ప్రజలలోని బుద్ధిమంతులకును- పైవిషయములలోని మర్మము తెలియకున్నదా?

స్వార్థపరు లెవరైన నున్నచో వారికి మాత్రము సత్యము గోచరించదేమో! ఏ కొంచెమైనను దయార్ద్రహృదయులై యుందు రేని - మరియు నీతి నియములతో వర్తించుచుందురేని - యీ గ్రంథముం జదివిన పిదప-ధర్మరక్షణముకై తమ శరీరముల నర్పింప కుందురా? తమ నామధేయములు - మరియు తమ కుటుంబములోని వ్యక్తుల నామధేయములు - హిందుమతమునకు సంబంధించి యున్న వని గుర్తునకుం దెచ్చుకొనినంజాలు. తమ భార్యల మంగళ సూత్రము లను వారి కంఠములందు బంధించిన దెవరు? తామేకదా! ఆ యాచా రము-హిందుమతమునకు సంబంధించినది కాదేమి? తాము మరెద్దియో

యొకశలవుదినంబునన్నైనను దేవాలయములకుంబోయియుండిరాలేదా? ఆయా దేవుల నామములున్ను తమ తమ – నామధేయములున్ను ఒక్కటియై యుండెనా లేదా? ఈ గ్రంథకర్త యొక్క నామధేయము కూడా మీరును మీ పితరులును ఎరింగిన దేవతల నామధేయము లలో జేరియుండెనని స్ఫురణకు వచ్చుచుండెనా లేదా? ఈ దృష్టితో హిందువులమైన మన మందిర మొక్కటియై యుంటిమి. తదితరులు మనలను ద్వేషించుచుందురూ. హిందువుల వ్యవహారమంతయుసంస్కృత భాషతో ప్రచలితంబగుచుండును. కాశి – రామేశ్వరము, బదరి అయోధ్య, కంచి, వెంకటాచలం, భద్రాచలం, సింహాచలం, కృష్ణా నది, గోదావరి, గంగ, యమున, వింధ్య హిమాలయము, సుబ్రహ్మ ణ్య నాగేశ్వరం, రామమూర్తి, నారాయణ, రుక్మిణి, సీత, లక్ష్మి హైమవతి, అనసూయ మున్నగుసంస్కృతనామధేయములతో మనము వ్యవహరించుకొనుచుంటిమి. బ్రాహ్మణ బ్రాహ్మణేతర నామములు, మరియుహరిజననామములు. గిరిజననామములు–ఇవియన్నియుసంస్కృత భాషా సంబంధములు. హిందువుల వేదములు, పురాణములు మున్నగు గ్రంథములు సైతము సంస్కృతభాషామయములు. హిందు మత ప్రచారము లేని కారణమున స్వమతాభిమానము నశించినదై అన్యమతాభిమాన బీజములు దినదినంబున మన హృదయక్షేత్రముల లోనికి వెదజల్లబడుచున్నవి. మనవారు క్రైస్తవులం గాంచినపుడు వారిని మిక్కిలి ప్రేమించుచుందురు. వారుమతభక్తులై యుండిరని కాదా! అవునుమనహిందువులంజూచినపుడేల ప్రేమింపజాలరు? వీరికి మతభక్తి లేదని తా మెరుంగుదురు. ఇంతకు మించిన కారణము వేరొకటిలేదు.

తమ హిందువుల విషయమై ప్రసంగము లెవ్వియోవచ్చినపుడెల్ల మనహిందువులు తమవారినే ద్వేషించుచుందురు. ఇంతకుమించినమంద మతులు ధరాతలంబున నుండబోరు. క్రైస్తవమత ప్రచారకుడగు బిషప్‌గాని, ఫాదరీగాని, ఫాస్టరుగాని తమవద్దకు చేరినయెడల వెంట నే గడగడ భయపడుచు మరియు మిక్కిలి ప్రేమించి తగిన యాదర ణముం జూపుచునుందురు. హిందుమతప్రచారకుడు సమీపించునేని

యూత దుద్యోగముం జేయక పనిలేని పనిని తలబెట్టి పనికిమాలిన పనిని చేపట్టిననియు పరిహాసింతురు. పైపైకి దండములుం బెట్టుచున్నను లోలోన నీతడొక చాదస్తుడనుకొనుచుందురు. తాము తమ మతము నందభిమానము లేనివారగుటచేతనే తమ మతప్రిచారకుని గౌరవించుట నెఱుంగరు. క్రైస్తవమత ప్రిచారకులను గౌరవింతు రెందులకో తెలియునా ?

వారి శిరముపైనున్న "కాప్రింగు" సర్వోత్తమంబగు చిహ్నమని గుర్తించి అద్దానిని తమ శిరములపై నుంచుకొనిన కారణమున తమకు గురురూపులై వెలయు క్రైస్తవులను దర్శించి యు[illegible] లేదో వెంటనే గౌరవించెదరు. రత్నములన్నియు నొక [illegible] త్తగుల్ల లన్నియు నొక తావున అను సామెతనువినమా !

"రుద్రిశ్శిఖా" అను మంత్రిం బొకటి కలదు.

భారతీయుల శిఖను, రుద్రి దేవునితో పోల్చబడెనని దాని భావము.

ఆ శిఖను కత్తిరించినయెడల రుద్రిదేవుని పరిహాసించినటులకాదా! ఆ దేవునకు ఆగ్రిహము కలిగెనేని ఫాలనేత్రిమును తెరువగలడు. ఆ నేత్రిమహిమ నెఱుంగనివారు లేరు.

హిందూ మహాజనులారా ! రుద్రుని కోపాగ్ని హిందువులమైన మనపై పడకుండునటులాగున యత్నింతము. ఇది బహు రహస్యమగు విషయము. ఇట్టి దురవస్థ సంభవించుటకు హేతువెద్దియో తెలియుదు. ఆంగ్లభాషాభ్యాసము గాక వేరొకటి లేదు. లార్డు మెకాలే అనునాతడెంతయో రహస్యము నెరింగినవాడగుటచే హిందువులనుభ్రిష్టులం జేయుటకుగాను మార్గమెద్దియని తర్కించి తుదకు ఆ జాతిలో నింగ్లీషు భాషను వ్యాపింపజేయ నిశ్చయించెను. మరియు నది మొద లీ దేశమున స్కూళ్ళలో నా భాషను చదివింపజేసెను.

## -: విదేశమత సిద్ధాంతములు బాధాకరములై యుండవేమి! -:

విదేశమతమున ప్రజలను బాధించు విషయము లెవ్వియు నుండవనియు, పురుషు లధికులనియు, స్త్రీలు అణగద్రొక్కబడి రనియు, అంటు ముట్టు దోషము లెవ్వియు నా మతమున లేవనియు పురుడు మయల మున్నగునవి యెవ్వియు గోచరింపవనియు క్రీస్తు యేసు శాంతివచనములనే పక్క-యుండెననియు మున్నగాగల విష యము లెన్నియో ఆ మతమున దర్శింప వచ్చుననుచుందురు. అవి యెంతవరకు నిజమో చూతము.

క్రీస్తుమతమున- స్త్రీ స్వాతంత్ర్య మున్నదా? లేదు.

"కాని ప్రతిపురుషునకు తల క్రీస్తనియు- స్త్రీకి తల పురుషుడ నియు క్రీస్తుకు తల దేవుడనియు మీరు తెలిసికొనవలెనని కోరు చున్నాను.)

(క్రొత్త బైబిల్ 1 కొరింథీయులకు 11 అ. 3వ.)

శిరము దేనినైనను హెచ్చరింప శేషించిన దేహము లోబడి నదై వర్తించుచుండును. అదేరీతిగ – పురుషులు క్రీస్తుగారికి లోబడి యుండవలెను. ఆ క్రీస్తు- తన తండ్రి తెల్పినటుల వర్తించుచుండ వలెను. తమ భర్తలు ఆజ్ఞాపించుచున్న విధులను గుర్తించి- స్త్రీలు వారికి లోబడి నడుచుచుండవలెను. దేవునకు క్రీస్తు- దాసుడు. క్రీస్తుకు పురుషులు దాసులు, పురుషులకు స్త్రీలు దాసులు. అదియే స్వాతంత్ర్యము కాబోలు కాంతలకు.

"స్త్రీలు సంఘములో మౌనముగా నుండవలెను. వారు లోబడి యుండవలసినదే కాని మాటలాడుటకు సెలవు లేదు. ఈలాగు ధర్మ శాస్త్రము తెల్పుచున్నది. వారు యేమైనను నేర్చుకొనగోరినయెడల ఇంట - తమ భర్తల నడుగ వలెను. సంఘములో స్త్రీ మాటలాడుట అవమానము."

(1 కొరింథీయులకు 14 అ. 34నుండి క్రొత్త బైబిల్)

## స్త్రీలకు అంటు ముట్టులు లేవా?

స్త్రీ దేహమందు - రక్తస్రావము కలిగినయెడల- ఆమె ఏడుదినములు కడగానుండవలెను. ఆమెను ముట్టువారందరును సాయంకాల పర్యంతము అపవిత్రులవుదురు. ఆమె కడగానున్నపుడు ఆమె దేని మీాద పడుకొనునో అది అపవిత్రమగును. ఆమె దేనిమీాద కూర్చుండునో అది అపవిత్రమగును. ఆమె పక్కను పరుపు ముట్టు ప్రతివాడు తన బట్టను పుతుకుకొని నీళ్ళతో వొళ్ళు కడుగుకొని సాయంకాల పర్యంతము అపవిత్రుడగును. ఆమె దేనిమీాద కూర్చుండునో దానిని ముట్టు ప్రతివాడు తనబట్టను పుతుకుకొని నీళ్ళతో వొళ్ళు కడుగుకొని (నను) సాయంకాల పర్యంతము అపవిత్రుడగును.

(పాత బైబుల్. లేవియా కాండ. 15 అధ్యా 19 వ)

ఇదే అధ్యాయంలో నుండి ఇంకను చదువుడు.

పురుషునకు వీర్యస్ఖలనమైన యెడల- ముట్టు స్త్రీలవలెనే అపవిత్రుడై యుండవలెనని కలదు.

* స్త్రీలు పురుషులను సేవించుటకే జన్మించి యుండిరి. *

మరియు—స్త్రీ పురుషునికొరకేగాని పురుషుడు స్త్రీ కొరకు సృష్టింప బడలేదు.

(1. కొరింథీయులకు 11 అ. 9నుండి.

(క్రొత్త బైబుల్)

## పురుడు విషయము

ఒకస్త్రీ గర్భవతియై మగ పిల్లని కనినయెడల ఆమె యేడు దినములు పురిటాలయి యుండవలెను. ఆమె తాను ముట్టుదే-కడగానుండు యేడు దినములు మేరచొప్పున పురిటాలయి వుండవలెను. ఎనిమిదవ దినమున వానికి శిశువునకు ఛేదనసంస్కారము (సున్నతి)

చేయింపవలెను. ఆమెతనశుద్ధిర క్తమందు ముప్పదిమూడు దినములుండి తన శుద్ధిదినములు సంపూర్ణమయ్యే పర్యంతము ఆమె పరిశుద్ధమైన దేనినయినను ముట్టకూడదు. పరిశుద్ధ స్థలములో ప్రవేశింప కూడదు.

లేవియా కాండ 12 అ. 2 నుండి స్త్రీలు ప్రసవించి మగవానిని కనిన యెడల 33 రోజులకు శుద్ధురాలగునని భావము.

ఆమె ఆడు పిల్లను కనిన యెడల ఆమె తాను కడగా నుండునట్లు పురిటాలయి యుండవలెను. ఆమె తన శుద్ధి ర క్తముకొరకు అరువదిఆరు దినములు కడగా నుండవలెను.

(12 అ. 5-6 వ.)

మగశిశువు కలిగితే 33రోజులు పురుడు. ఆడబిడ్డ పుట్టినయెడల 66 దినములు పురుడు. దీనిం బట్టి స్త్రీజాతి పురుషజాతికంటె హీనమైనదని అర్థమగుచున్నది. సమాన స్వాతంత్ర్యమనిన నిటులనే యుండును కాబోలు !

ఆపత్కాలమున కుమార్తెను పెండ్లాడ వచ్చును

అయితే ఒకని కుమార్తెకు ఈడు మించిపోయిన పక్షమందును ఆమెకు వివాహము చేయకపోవుట- యోగ్యమైనదికాదని యొకరు తలచినయెడల అతడు తన యిష్టము చొప్పున చేయవచ్చును. అందులో పాపములేదు. (అనగా) పెండ్లి చేసుకొనవచ్చును———— భార్య (తాను) బ్రతికియున్నంతకాలము బద్ధురాలై యుండును.

(క్రొత్తబైబిల్ 1 కొరింథీ 7అ. 36నుండి)

ఇందలిభావము. తనకుమార్తెకు సరియగు సంబంధము లభింపకుండ ననిమెంచి పెండ్లిచేయక ఆపుదమనిన- ఆమెయొక్క ప్రవర్తన-సరియైనదిగానుండదనియొకతండ్రినిశ్చయించుకొనెను. ఇకకర్తవ్యమెది? "తన యిష్టము వచ్చినటుల జేసినను అందుచే పాపముకలుగదు. పెండ్లి చేసుకొనవచ్చును! అని పై వాక్యముల సారము. వివాహమును చేయవలసిన

వాడెవడు!తండ్రియేకదా.వివాహకర్తగానున్న తాను పెండ్లిచేసికొన వచ్చుననిసారాంశము. ఈచిక్కునుతప్పించుకొనుటకై ఆమె పెండ్లిచేసికొనవచ్చుననుచు క్రొత్తగా ఆమె అను పదమునుచేర్చి ఈనడుమ ముద్రింప బడుచున్న బైబులునందు ఇరికించి యుండిరి. ఈరీతిగ బైబులును సైతము మార్చుచున్నారు. పూర్వ ప్రతులలో ఆమె అనుపదమును చూపజాలరు. ఎవనికైనను — ఇచ్చి పెండ్లి చేయ వచ్చును అనురీతిగ నర్థముం జేయుచుండిరి అది నిజమైనయెడల అందులో పాపములేదు అను వాక్యమును వ్రాయవలసిన యవసరము లేదు. కాని ఇష్టము-వొప్పునచేయవచ్చును అని బైబులునందున్నందున తనయిష్టము వచ్చినటుల ఆమెను వాడుకొనవచ్చును అని యర్థమగు చున్నది! పైరీతిగ నాచరించుటకు సంశయింపరాదనియు తెలుపదలచి అందు పాపములేదని వివరించి యుండెను ఆపౌలుద్వార. తండ్రి పెండ్లి చేసికొనుట పాపములో జేరదని తాత్పర్యము. మరియొక పరమ రహస్య గ్రంథము సైతము వేరొకటి రాగలదు. పైవిషయమున చెలరేగుచున్న ఎదుటి పక్షపు వాదము రాబోవుఆగ్రంథమున బాగుగ విమర్శింపబడును. భార్యయనునది తాను బ్రతికియున్నంతకాలము తనపతికి లోబడి యుండవలెననియు పైవాక్యములలో వెల్లడింప బడెను. కావున పురుషులతోబాటు స్త్రీలు సమాన స్వాతంత్ర్యమును కల్గియుండరని బైబులునుండి చూపించుటకు సమర్థులైనవారుండరు.

—: కలహములం బెట్టుటకు వచ్చియుంటినని ఏసు పల్కెను. :—

ఈవిషయమై ప్రమాణ వాక్యములు సూర్య నమస్కారములు క్రీస్తుమత రహస్యం — అనుదానిలో — 39 పేజీని చూడుడు.

☞ కృష్ణుడు గోపికల నడుమ వ్యవహరించెనా? లేదు.

ఏసుగారొక పాపాత్మురాలతో అత్తరు పూయించుకొనలేదా. ముద్దుపెట్టించుకొనలేదా ? ఆవిషయమై వినుడు.

"ఆయూరిలోనున్న పాపాత్మురాలైన (వ్యభిచారిణి)

యొక స్త్రీ యేసు పరిసయ్యుని యింట భోజనమునకు కూర్చున్నాడని తెలిసికొని యొక శిలా భరిణలో అత్తరు తీసికొని వచ్చి — — — కన్నీటితో ఆయన పాదములకు ముద్దు పెట్టుకొని ఆ అత్తరు వాటికిపూసెను.

లూకా. 7 అ. 37 నుండి.

పై ప్రక్రియ భక్తి సంబంధముగ జరిగియుండునని-తెలుపుదురేని శ్రీకృష్ణుని విషయమై గోపికలు సేవించుటయు భక్తిభావమునే సూచించునని వార లెరుగవలెను.

"శ్రీకృష్ణ భగవాన్" అను గ్రంధమును జదువగల్గిన యెడల ఆ మహనీయుడు—భార్యలతో నైనను క్రీడించి యెరుగడని నిర్ణయించుకొనగలరు. ఈవిషయమై తెలియదగిన రహస్య మెంతయోకలదు.

ఇంతయేల? ఈ గ్రంధమాలలోని హిందుమత గ్రంధముల నన్నింటిని చదువని హిందువులు- అన్యుల ప్రశ్నలకు సరియైన ప్రత్యుత్తరము లొసంగ జాలరు. కావున వానినన్నింటిని తెప్పించుకొని పఠింప వలెనని ప్రార్థించుచున్నాను.

అన్యమతమున నిల్చి యున్నవారిని తమ మతమున జేర్చుకొనుదురేని- వారు- అన్యమత దూషణ మొనరించిన వారలగుదురు. హిందువు లెన్నడును పాకిస్తానాకు వెళ్ళి- మాకృష్ణుడే లోకరక్షకుడు అని బోధించి యుండిరా! అట్టిదుర్గుణము హిందువుల రక్తమున నే లేదు.

☞ కృష్ణుడు శాపగ్రస్తుడా ! అహా

క్రీస్తుయేసు శాపగ్రస్తుడు కాడేమి?

అబ్రహాం పొందిన ఆశీర్వచనము క్రీస్తుయేసు ద్వారా అన్య జనులకు కలుగుటకై క్రీస్తు మనలకు గాను శాపగ్రాహియై మనలను ధర్మశాస్త్రముయొక్క- శాపమునుండి విమోచించెను.

ఇందునుగూర్చి- మ్రాను (సిలువ) మీద వ్రేలాడిన వాడును శాపగ్రస్తుడు అని వ్రాయబడియున్నది.

(గలతీయులకు 3అ. 14, 15 వచ. క్రొత్తబైబుల్)

ఏసుగారు కూడా మ్రానుమీద వ్రేలాడియున్న కారణముచే నతడును శాపగ్రస్తులలో చేరినవాడాయెను.

ఆదాము హవ్వలు తమ దేవుని యాజ్ఞను ధిక్కరించిన కారణము సైతానుయొక్క బోధ వైయున్నందున ఆ సైతాను శపింపబడెను. పిదప— ఆదాము హవ్వలారా! మీరును నామాటలను విశ్వసింపక వ్యవహరించితిరి. కావున మీరు నివసించుచున్న భూమిని శపించు చున్నాను. అందు ఫలించుచున్న ధాన్యములు శాపమూలమున భ్రష్టములై పోవును. అట్టివానిం దినుచున్న మీరును శాపగ్రస్తులలో చేర్చబడుదురు. మీ వంశములలో జన్మింపబోవువారును మీవలెనే కామించుచు బిడ్డలం గనెదరు. కావున వారును పాపగ్రస్తులలో చేరెదరు, అను భావమును సూచించుచున్న వాక్యములతో వారిని దుర్గతుల పాలొనరించెను. ఆదాము హవ్వల వంశములోని వ్యక్తియే మనఏసుగారు. కావున ఆదిమానవుల రక్తము క్రీస్తు యేసునందును వ్యాపించి యున్నది. ఆయనయందు నిల్చియున్నరక్తము శాపగ్రస్తమై యున్నందున క్రీస్తు శాప గ్రాహులలో చేర్చబడును.

అదిగాక— వేరొక కారణము కలదు. దాని నాలకింతము.

శిలువపైనుంచబడినట్టి వ్యక్తులుకూడా పాపపు నేలలోని ధాన్యమునం దినిన దోషమున - దేవునిచేశపింపబడినపాలిస్తానాలోని ప్రజ లెల్లరు శాపగ్రసులై యుండిరి. వారిలోని వారే మన యేసుగారు. కనుకనే పైవచనములలో క్రీస్తుయేసు శాపగ్రాహియై యుండెననుచు నొకమారుగాక రెండుమారులు ఉచ్చరింప బడెను. ఆవాక్యముల కన్నిటికిని అంతరార్ధములం జెప్పగల శక్తి

తమకున్నదని భావింతురేమో! అహో! హిందువులుమాత్రము తమ గ్రంథములలోని వచనములకు అంతరార్థములం జెప్పలేకుండిరా?

నవనవలాడుచున్న అంజూరచెట్టునుఎండిపొమ్మని ఏసుగారు శపించిరి. (మార్కు 11అ. 11నుండి)

క్రైస్తవులు ద్రౌపదిని వెక్కిరించుచుందురు. తమ మతమున ఐదుగురు పతులుకల్గిన ఒకానొక వనిత కలదని వారెరుంగరు.

(యోహాన్ 4అ. 15.నుండి.)

## గమనింప దగిన మరియొక రహస్యము

స్వరాజ్యమవతరించిన సమయమునకు మన దేశమున 26 వేల 918 మంది క్రైస్తవమత ప్రచారకు లుండిరని లార్డు హాలిఫాక్సు అనునాతడు తెల్పియున్నాడు. అది మొదలు నేటివరకు గతించిన యిరువదేండ్లలో 30 వేలకు మించిన ప్రచారకుం తయారై యుందురు. ఆవాక్యములను వినిన వెంటనే బ్రతికియు చచ్చిన వారిలో జేరినవార మగుదుము. ఇవి లార్డుహాలిఫాక్సు అను నాతనిచే వివరింప బడిన లెక్కలు. విశ్వహిందూ పరిషత్తుయొక్క మాసపత్రిక నుండి పై లెక్కలుం తి వ్రాయబడినవి.

నేటికి 1 కోటి, 7లక్షలమంది క్రైస్తవమతమున జొరబడినవారు కలరు. వారుగాక శ్రీరామ శ్రీకృష్ణదేవులను విడనాడి రహస్యముగ క్రీస్తును విశ్వసించినవారు 6 కోట్లమంది కలరు.

వెరశి 7 కోట్ల సంఖ్యకు మించినవారు ఆ క్రైస్తవులు మన దేశమున నుండిరి.

రాబోవు మరియొక "పరమరహస్య గ్రంథమున "మరెన్నియో రహస్యములం దెలియగలుగుదురు మనపాఠకులు.

స మా ప ము.



# సూర్యనమస్కారములు

1. హంసాయ భువనధ్వాంత। ధ్వంసా(య)యా (అ)మిత తేజసే॥
హంసవాహన రూపాయ భాస్కరాయ నమోనమః

పరాత్పరా! పరమ పురుషా! నీవు హంసస్వరూపుడవు. పదునాల్గు లోకములలో వ్యాపించియున్న గాఢాంధకారమును నశింపజేయుటకు తేజస్స్వరూపుడవై ప్రకాశించుచున్నావు. మహాత్మా! బ్రహ్మాండమునకు ప్రతిబింబమై వెలయు నీ పిండాండమున బుద్ధి యనునది సర్వవిధముల జీవుని ప్రతిబంధించుచున్నది. ఇంతకు మించిన గాఢాంధకార మేమికావలెను ? ఆ బుద్ధిని సన్మార్గమున ద్రిప్పుటకు సైతము నీ దివ్యశక్తి సర్వ సామర్థ్యమును గల్గియున్నది. బుద్ధిప్రచోదకుండవగుటచే నిన్ను నమస్కరించుచున్నాను. జగన్నాయకా! హంసస్వరూపుడ వగుటయేగాక హంసవాహనుడవై వర్తించుచుందువు. ఇయ్యది కడుంగడు చిత్రము. ప్రభాకరా ! ఇవిగో నా నమస్కారములు.

2. వేదాంగాయ పతంగాయ విహం (గ) గా(ఆ)రూఢమూర్తయే
హారిద్వర్ణ తురంగాయ భాస్కరాయ నమోనమః॥

పరమేశ్వరా ! వేదములు నీ యంగములు. అంతరిక్షమున చరించుచున్న పతంగమును (పక్షిని) బోలినవాడవై విహరించుచున్నావు. నీ అనంతశక్తి స్తవనీయము. నీవధిష్ఠించు రథమునకుబంధింపబడిన గుర్రము (తురంగము) లనినవో ధగద్ధగాయ మాన ప్రభతో వివిధ వర్ణములు కల్గి విరాజిల్లుచున్నవి. ఐనను అందు ముఖ్య

మగు కాంతి బాహ్యమునకు పచ్చనిదై (హరిద్వర్ణం) దృశ్యమగు చున్నది. ఈ రామణీయకమును గాంచి భక్తులొక్కరేగాక సర్వులు విస్మయ మొందుచున్నారు. జగత్పతీ ! వారిలో నేనొక్క డను. నా నమస్కృతులు గైకొని మమ్ముద్ధరింపుము.

3. భువనత్రియదీప్తాయ । భుక్తిముక్తి ప్రదాయచ
భక్త దారిద్ర్యనాశాయ। భాస్కరాయ నమోనమః॥

దేవా ! భూలోక, భువర్లోక, సువర్లోకములు అనునవి భువనత్రియములని ఖ్యాతిగాంచి, నీ మూలమున కాంతివంతము లగుచున్నవి. దయానిధీ ! నీవీలోకమునకు జీవనాధారుడవు. ఎట్లన నీ కిరణములు పుడమిపై నున్న జలము నాకర్షించి, అంతరిక్షమునకు గొంపోవుచు, అచట మేఘములను సిద్ధపరచిన కారణముచే వర్ష మేర్పడి జీవరాశికి జీవనాధార మగుచున్నది. ఇది బాహ్యవిషయము. ఇక లోనికిం బోతిమా ! నీ దివ్యశక్తి హృదయాంతరాళమున జేరి మానసిక దోషమును తొలగించి జీవులను శుద్ధాత్ములుగ నొనరించు చున్నది. అటుపైన ముక్తి కరతలామలకము.

మహాత్మా ! నిజమారయ నీవు భుక్తిముక్తి ప్రదాతవు. వివి ధైశ్వర్యముల ననుగ్రహించి దారిద్ర్య దోషమును తొలగించుట యందు అద్వితీయ ప్రతిభాయుతుడవు. కావుననే దరిద్ర నారాయణుడ వని ముల్లోకములలో కీర్తింపబడుచుంటివి. శ్రీ సూర్యనారాయణా ! ఇదిగో నా నమస్కారములు.

4. లోకాలోక ప్రకాశాయ। సర్వలోక (క)కై(ప)క చక్షుషే.
లోకోత్తర చరిత్రాయ ! భాస్కరాయ నమోనమః॥

తేజోమయా ! పదునాలుగు లోకములనేగాక, ఆ యా లోకముల కవ్వల అలోకమై వెలయు ననంత వలయమును సైత మాక్రమించి నీ తేజము ప్రకాశించుచున్నది. సర్వలోక ప్రకాశ

కుడవై ఏకైక నేత్రముగ గోచరించుచున్నావు. మరియు లోకో త్తరంబగు చరిత్ర కలిగి, కాంతిదాతవై రాణించుచుంటివి. సహస్రాక్షా ! ఇవిగో నా నమస్కృతులు.

5. సప్తలోక ప్రకాశాయ । సప్తసప్తిరథాయచ
సప్తద్వీప ప్రకాశాయ భాస్కరాయ నమోనమః ॥

భూలోక భువర్లోక సువర్లోకములు మూడును; మహర్లోక, జనలోక తపోలోకములు మూడును; సత్యలోక మొకటియు కలసి సప్తలోకములై ప్రకాశించుచున్నవి. సర్వలోకైకనాథా ! ఆయా లోకములను మరియు అందలి జీవులను ప్రకాశింపజేయుచు లోకైక ప్రభువుగ తాండవించుచున్నావు. ఏడు గుఱ్ఱములచే బంధింపబడిన రథము నధిష్ఠించి శింశుమారచక్రము ననుసరించుచు సప్తద్వీప ములను తేజోవంతములుగ జేయుచుంటివి. ఆహా ! నీ మహిమ అచింత్యమై అప్రమేయమై యలరారుచున్నది. దేవా ? ఇవిగో నా నమస్కారములు.

6. మార్తాండాయ ద్యుమణయే । భానవే చిత్రభానవే
ప్రభాకరాయ మిత్రాయ । భాస్కరాయ నమోనమః ॥

మార్తాండుడవై ద్యులోకమును వెలిగించుచున్న దివ్యమణివై చిత్ర విచిత్ర కిరణములచే ప్రకాశించుచున్న దేవా ! నా నమస్కార ములు గైకొనుము.

7. నమః కమలనాభాయ । నమస్తే కమలప్రియ
నమఃకమలహస్తాయ భాస్కరాయ నమోనమః ॥

మహాత్మా ! కమలములను వికసింపజేయు శక్తి నీయందు కలదు. కావుననే కమలనాథుడవని కీర్తింపబడితివి. మఱియు కమల ప్రియుడవని స్తుతింపబడుదువు. జీవుల హృదయకమలములనుసైతము

వికసింపజేయుదువని సూచించుటకుగాను నీ హస్తమున కమలమూ నొకదానిని ధరించియుంటివి. కమలహస్తా ! నా నమస్కృతుల గైకొనుము.

8. నమస్తే బ్రహ్మరూపాయ నమస్తే విష్ణురూపిణే
నమస్తే రుద్రరూపాయ భాస్కరాయ నమోనమః ॥

పరబ్రహ్మమా ! ఉదయకాలమున చతుర్ముఖ బ్రహ్మవై రాణించుచుందువు. మధ్యాహ్నమున రుద్రరూపుడ వగుదువు. అస్తమయమున విష్ణురూపము ధరించి జీవపోషణ మొనర్చుచుందువు. ఇట్లు త్రిమూర్తి స్వరూపమును ధరించి ఏకైకమూర్తివై సాక్షాత్కరించిన దేవా ! నీ మహిమ వర్ణనాతీతము. హరిహరబ్రహ్మలను సేవించు భక్తులు తమతమ దైవములను దర్శింపజాలక పరితప్తులగుదురని యెంచి శ్రీ సూర్యనారాయణ స్వరూపుడవైతివి. మరియు లోకేశ్వరుండొకడు కలడని చాటించుచుంటివి. దేవుడున్న యెడల చూపగలరా ? యని నాస్తికులు ప్రశ్నించుచుండ "ఇదుగో దేవుడు" అని నిర్దేశించుటకుగాను మా యెదుట సాక్షాత్కరించితివి. మహాత్మా ! ఇవిగో నా నమస్కృతులు.

9. సత్యజ్ఞాన స్వరూపాయ సహస్ర కిరణాయచ
గీర్వాణ భీతినాశాయ భాస్కరాయ నమోనమః ॥

తేజోమయా ! నీవు సత్యరూపుడవు. మరియు జ్ఞానమయుడవు. అనంత కిరణములు అను కరుణాకటాక్షములు కలిగి రాణించుచున్న దయామయుండవు. గీర్వాణ బృందమును (దేవతలను) బాధించుచున్న రక్కసుల నణచుటకు కంకణము కట్టిన మేటివి. కనుకనే అనవరతము నిన్ను నమస్కరించుచున్నాము.

10. సర్వదుః(ఖ)ఖో (ఉ)పశాంతాయ సర్వపాప హరాయచ
సర్వవ్యాధి వినాశాయ భాస్కరాయ నమోనమః ॥

రక్షకా ! జీవులెల్లరు నిన్నాశ్రయించుచున్నారు. అందుకు హేతువెద్ది ? నిరంతరము సంభవించుచున్న దుఃఖముల నశింపజేతువని కదా ! అందుకనియే మమ్ముల నావరించిన మేరుమందర తుల్యములగు పాపములం బారద్రోలి మా దుఃఖముల తొలగింతువని విశ్వసించితిమి. కావున మా కోర్కెల దీర్చి మమ్మాదరింపుము. ఇవిగో సాష్టాంగ నమస్కారములు.

11. సహస్రపత్రనేత్రాయ సహ(స్ర)స్రా (అ) క్షిస్థితాయచ
సహస్ర నామ దేహాయ భాస్కరాయ నమోనమః ॥

కమలనేత్రా! నీ నివాసము మా దేహమున సహస్రారమైయున్నది. అయినను జీవరాసుల హృదయములలో నివాస మేర్పరచుకొని వ్యావహారిక కార్యము లొనర్చుటకు సాయపడుచుంటివి. కావున అనంతములగు జీవుల నామములు నీ నామములై యున్నవి. అనంత కళ్యాణగుణ శోభితా ! నా వందన శతంబులు గైకొనుము.

12. నిత్యాయ నిరవద్యాయ నిర్మలజ్ఞాన మూర్తయే
నిగమార్థ ప్రకాశాయ భాస్కరాయ నమోనమః॥

పరాత్పరా ! సర్వకాల సర్వావస్థల యందు నీవు నిల్చియున్నందున నిత్యుడవని యశము గాంచితివి. ప్రభో ! నీవు నిరవద్యుడవు. అనగా జీవులవలె నధమాధమ స్థితి యందుండవు. సర్వోత్తమంబగు పరమపదము నలంకరించిన సత్యదేవుడవు. నీ రూపము నిర్మలంబగు జ్ఞానరాశికి నిలయము. కావుననే వేదార్థముల ప్రకాశింపజేసి జగద్గురువువై రాణింపగల్గితివి. హే గురో ! అజ్ఞానాంధకార విధ్వంసకా ! ఇవిగో, నా వందన సహస్రములు.

13. ఆది మధ్యాంత శూన్యాయ వేదవేదాంత వేదినే
నాదబిందు స్వరూపాయ భాస్కరాయ నమోనమః॥

ఈశా! మహేశా! అనంతములై వెలయు నా యాశలు నిలువనీడలేక నీపాల బడినవి. ఆది మధ్యాంత శూన్యుడ వగుటచే వాని నన్నిటిని నీ యందు నిలుపుకొని ఫలవంతముగ నొనరింపుము. లోకైకనగ నొకడుండెనని వేదవేదాంతవాఙ్మయము ప్రకటింపుచున్న మహాదేవా! నిన్నెవరు నమస్కరింపగలరు? వేదవేదాంత వేద్యుడ వైన నీవు నిరంతరము నాదరూపమున ప్రతిధ్వనించుచుందువు. ఆ ధ్వని (సౌండ్ వేవ్స్) నుండి విద్యుత్పరమాణువు లేర్పడి అత్యంత వేగసంపన్నములయి తత్ప్రభావమున అణురూపమును బొంది యీ విశాలవిశ్వమును సృజింపుటకు సర్వసమర్థము లగుచున్నవి. నీవు బిందు స్వరూపుడ వగుటచే సూర్యచంద్ర నక్షత్ర మండలములు, పృథ్వీ మండలము మున్నగునవన్నియు, బిందువులవలె నగుచున్నవి. అనగా గుండ్రనివిగా యున్నవి. విచారింప బిందువుయొక్క రూపము పూర్ణముగ నుండును. నీవును పూర్ణుడవే. నీ వలె నిలువనెంచినదై లోకమంతయు బిందురూపమును పొందెను. అనగా గోళాకారమును దాల్చెను. బుద్ధియు బిందు వనబడును. నాదబిందు స్వరూపా! నా నమస్కారములు గైకొని నీలో జేర్చుకొనుము.

14. నిర్మల జ్ఞానరూపాయ రమ్య తేజ స్వరూపిణే
బ్రహ్మ తేజ స్వరూపాయ భాస్కరాయ నమోనమః.

శరణాగతవత్సలా! నీవు జ్ఞానమయుడవు. మరియు తేజ స్వరూపుడవు. విచారింప బ్రహ్మ తేజమున వెలుగొందు దివ్యపురుషుడవు. అజ్ఞానాంధకార విధ్వంసకా! ఇవిగో నా నమస్కృతులు.

15. నిత్యజ్ఞానాయ సత్యాయ నిర్మలజ్ఞానమూర్తయే
నిగమార్థ ప్రకాశాయ భాస్కరాయ నమోనమః॥

మహాత్మా! ఆదినుండి అంత్యము వరకు మాయందు జ్ఞానము అవిచ్ఛిన్నమైయుండదు. నీయందటుల కాదు; ఆ జ్ఞానము సతతము

నిల్చియుండును. అంతియేకాదు. మలినమును జెందక నిర్మలమై విలసిల్లు చున్నది.

దయామయా! అజ్ఞానమునుండి విడివడి మేమెల్లరము జ్ఞాననిష్ఠులమై యుండవలెనని వాంఛించుచున్నాము. మా యభిమతంబును ఫలవంతి మొనర్చుటకు కావలెను! దివ్యసాధనములగు వేదవేదార్థములను ప్రకాశింప జేసితివి దేవాదిదేవా! దివ్యస్వరూపా! నీపాదారవిందముల కనేక వందనములు.

16. కుక్షివ్యాధి వినాశాయ దుష్టవ్యాధి హరాయచ
ఇష్టార్థదాయినే తస్మై భాస్కరాయ నమోనమః॥

వేదవేదాంతవేద్యా! లోకైకవేద్యా! మా గర్భము (కుక్షి) సర్వవిధముల వ్యాధిగ్రస్తమైయున్నది. ఆ దోషమును త్వరితముగ శమింపజేయుము. ఇంకను దుష్టములైన వ్యాధు లెన్నియో కలవు. వానినన్నిటిని హరింపజేసి ఆరోగ్యవంతులం జేయుము. ఆదిమధ్యాంతశూన్యా! మాకోర్కెలను కొనసాగింప నర్హుడవు నీవే. హే భగవన్! మా నమస్కృతుల గైకొనుము.

17. భవరో(గ) గై (వ)కవైద్యాయ సర్వరో(గ) (అ)గాపహారిణే
ఏకనేత్రిస్వరూపాయ భాస్కరాయ నమోనమః॥

గురో! సవితృదేవా! మితిమించిన పుణ్యమొనరించువారు స్వర్గలోకమున నుందురు. అత్యంత పాపమును గావించువారు నరకమున నుందురు. పుణ్యపాపములు రెండును సమముగ నాచరించువారు నరులై నించుచుందురు. ఆరీతిగ జననమందినవారిలో మేమొక్కరము. భూమండలమున జనన మొందుట యొక రోగమైయున్నది. నిజముగ భవ (జన్మ) రోగము తదితరరోగములకంటె మేటియై యున్నది. ఆ రోగమునుండి విడివడుటకై వైద్యుని వెదకుచున్నాము. ఆ వైద్యుడవు నీవేయనుచు గ్రహింపగలిగితిమి. ప్రభో! సర్వరోగాప

హరీ! నేనొక్కరుండనే కాదు, అసంఖ్యాకులగు జీవులు భవరోగబాధలకు గురియగుచున్నారు. వారినెల్లరిని దర్శించుటకు నేత్రరూపుడవై గగనభాగమందుంటివి. మహాత్మా! ఇవిగో నా హృదయపూర్వక నమస్కారములు.

18. దారిద్ర్యదోష నాశాయ ఘోర పాపహారాయచ
దుష్టశిక్షణ ధుర్యాయ భాస్కరాయ నమోనమః॥

దేవా! దరిద్రదేవత తాండవించి మనశ్శాంతిని భంగపరచుచున్నది. కనుకనే పాపములం జేయుచున్నాము. కాలము పరిపక్వమైనది కాబోలు! బుద్ధిని సన్మార్గముననుంచుటకు శ్రీ సూర్యనారాయణుం డొక్కడే అర్హుడని వింటిమి. సవితృదేవా! దారిద్ర్యమును తొలగించి ఘోరములైన పాపములం దునుమాడుము. పాపకార్యములలో మునిగి తేలుచున్న మమ్ము శిక్షించుచున్న దేవా! నా నమస్కృతులు గైకొనుము.

19. హోమ(మ + అ) మానుష్ఠాన రూపాయ కాలమృత్యుహరాయచ
హిరణ్యవర్ణ దేహాయ భాస్కరాయ నమోనమః॥

మహాత్మా! ఎందరో భక్తులు నిన్నాశ్రయించి జపతపంబులు గావింతురు. మరియు హోమము లొనర్తురు. ధర్మసంబంధమగు అనుష్ఠానమంతయు నీరూపమైయున్నది. అకాలమృత్యువే కాదు. కాలమృత్యువు సైతము సంభవింపని రీతిగ మమ్మనుగ్రహింపుము. నీ యాశ్రయము కలుగునేని భయము పలాయనము చిత్తగించును. దేవా! నీ శరీరమున లోపలిభాగమును మరియు నీ బాహ్యరూపము శుద్ధస్వాతికమయములుగా నున్నవి. కావుననే హిరణ్యవర్ణుడవని కీర్తింపబడితివి. పరిపూర్ణబ్రహ్మమా! మా నమస్కృతులు గైకొనుము.

20. సర్వసంపత్ ప్రదాత్రేచ ! సర్వదుఃఖవినాశినే
స (ర్వ + ఉ)ర్వోపద్రవనాశాయ భాస్కరాయనమోనమః॥

కామస్వరూపా ! మా కోర్కెలు అపరిమితములై సర్వసంపత్తుల నభిలషించుచున్నవి. వాని ననుగ్రహింపుము. ఎందుకన నీ వొక్కరుండవే సర్వసమర్థుడవు. మహాత్మా ! మాయందు దుఃఖములు మితిమించుచున్నవి. ఇంకను ఉపద్రవములు చెలరేగుచున్నవి. వానినన్నిటిని నశింపజేయుగ వారు నీ కృపవ్వ వేరొకరు గోచరింపరు. లోకైకరక్షకా ! జగన్మాత ! నీకు మా నమస్కారములు.

21. నమో ధర్మనిధానాయ నమః (సు)సుకృతసాక్షిణే
నమః ప్రత్యక్షరూపాయ భాస్కరాయ నమోనమః॥

దేవా ! ధర్మము నీ యధీనము. నిజమారయ నీవు ధర్మస్వరూపుడవు. కావున నిన్నాశ్రయించిన వారలు అధర్మపరులు కాజాలరు. మరియు సుకృతముల నాచరించి నీ దయకు పాత్రులగుదురు. మహాత్మా ! నరులాచరించు సుకృతముల వీక్షించుటకే అంతరిక్షసంచారివై సాక్షిణివలె భాసించుచున్నావు. ప్రత్యక్షముగ దేవుని దర్శింపవలెనని ఆ దైవ మెచట గోచరించునని ప్రశ్నించుకొని యుంటిమి. నీవే ప్రత్యక్షదైవమని వేదములయందు నిర్ణయించుకొనియుంటిమి. కావున నిన్ను నమస్కరించుచున్నాము.

22. సర్వలో(క + ఏ)కైకపూర్ణాయ కాలక(ర్మ + అ)ర్మాఘహారిణే
నమః పుణ్యస్వరూపాయ భాస్కరాయనమోనమః ॥

లోకమందెందుగాంచినను నిండి నిబిడీకృతంబై రాణించుచున్న దైవము పరిపూర్ణ బ్రహ్మమైయున్నది. ఆ యనంత బ్రహ్మమునకు ప్రాతినిధ్యమువహించి "నేనే బ్రహ్మము" అని శాసించుచున్న నీవు నిజముగ రెండవ బ్రహ్మవై యున్నావు. కనుకనే "అసౌ ఆదిత్యః బ్రహ్మ" అనుచు విద్వాంసులు నిన్ను సంస్మరింతురు.

ఆయాకాలములలో కర్మల నాచరించుచు తన్మూలమున పాపముల నొనరించువా రెందరులేరు ? వారిలో మేమొక్కరము. మా పాపములు వాసనారూపములై దాగియున్నందున నాయావాసనలను సమూలముగ నశింపజేయుము. ఇంతకును నీవు పుణ్యస్వరూపుడవు. కావుననే పాపవిధ్వంసకుడవైతివి. పాపసంహారకా ! ఇవిగో మా నమస్కృతులు.

23. ద్వంద్వవ్యాధి వినాశాయ సర్వదుఃఖ వినాశినే
నమః (+తా) స్తాపత్రియఘ్నాయ భాస్కరాయనమోనమః

తేజోమయా ! జీవులకు తోడునీడవై సహకరించుచున్న నీ తత్త్వము శ్లాఘనీయము. దేహమం దొకానొక సమయమున మేహవ్యాధియు, వేరొక కాలమున వాతవ్యాధియు నంకురించి ద్వంద్వరోగముగ మారుచునుండును. దానిని శమింపజేయుటకు వైద్యులు వెనుకంజవేయుదురు. అట్టివ్యాధిని నశింపజేసి ఆరోగ్యమును చేకూర్చుటకు మిక్కిలి సమర్థుడవు. మహాత్మా ! కనుకనే ద్వంద్వ వ్యాధి వినాశకుండవని ఖ్యాతిగాంచితివి. ఒక్క వ్యాధివిషయమే కాదు. సర్వ దుఃఖములను నశింపజేయగల్గుదువు. సంసారతాపత్రియము సయితము నీచే ధ్వంసము చేయబడును. దయామయా ! ఇవిగో మా నమస్కృతులు.

24. కాలరూపాయ కల్యాణమూర్తయే కారణాచయ
విద్యాయ భయసంహర్త్రే భాస్కరాయ నమోనమః ॥

మహాత్మా ! సృష్టిసాధనంబగు కాలము నీ స్వరూపము. నీ విగ్రహమన్ననో దివ్యసుందరమై శోభనప్రదమగుచున్నది. విశాలమగు నీ విశ్వమునకంతకును ముఖ్యకారణుండవు నీవు. విద్యలు నీ యధీనములు. కావున జీవులను భయవిదూరులంజేయుచునుందువు. భీతినాశకా ! ఇవిగో మా వందనములు.

పై నమస్కారము లన్నియు చేయలేనివారు 'శ్రీ సూర్య నారాయణ పరబ్రహ్మణేనమః' అని నమస్కరించినం జాలు. 'శ్రీ రవి పరబ్రహ్మణేనమః' అనియు నమస్కరింప వచ్చును.

కనీసపక్షము 12 నమస్కారము లయినను యీ క్రింది విధముగ నాచరింపవలెను.



## 12 నమస్కారములు

1) హ్రాం మిత్రాయ నమః
2) హ్రీం రవయే నమః
3) హ్రూం సూర్యాయ నమః
4) హ్రైం భానవే నమః
5) హ్రౌం ఖగాయ నమః
6) హ్రః పూష్ణే నమః
7) హ్రాం హిరణ్యగర్భాయ నమః
8) హ్రీం మరీచయే నమః
9) హ్రూం ఆదిత్యాయ నమః
10) హ్రైం సవిత్రే నమః
11) హ్రౌం అర్కాయనమః
12) హ్రః భాస్కరాయ నమః

హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః మిత్ర, రవి సూర్య, భాను, ఖగ, పూష, హిరణ్యగర్భ, మరీచ్యాదిత్య, సవిత్రర్క, భాస్కరేభ్యో నమః అనుచు ప్రతిదినంబున హిందువులైన వారు నమస్కరింపవలెను.

## ఆదిత్య హృదయ స్తోత్రము.

శ్లో॥ ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీ
నారాయణ స్సరసిజాసన సన్నివిష్టః
కేయూరవాన్ మకర కుండలవాన్ కిరీటీ
హారీ హిరణ్మయ వపుర్ధృత శంఖ చక్రః

1. తతోయుద్ధ పరిశ్రాంతం, సమరే చింతయాస్థితం
రావణం చాగ్రతో దృష్ట్వా, యుద్ధాయ సముపస్థితం॥

2. దైవతైశ్చ సమాగమ్య ద్రష్టు మభ్యాగతో రణం
ఉపాగ మ్యాబ్రవీ ద్రామ మగస్త్యో భగవాన్ ఋషిః॥

3. రామరామ మహాబాహో శృణు గుహ్యం సనాతనమ్
యేన సర్వా నరీన్ వత్స సమరే విజయిష్యసి॥

4. ఆదిత్యహృదయం పుణ్యం సర్వశత్రు వినాశనమ్
జయావహం జపే న్నిత్య మక్షయ్యం పరమం శివమ్॥

5. సర్వమంగళ మాంగల్యం సర్వపాప ప్రణాశనమ్
చింతాశోక ప్రశమన మాయుర్వర్ధన ముత్తమం॥

6. రశ్మిమంతం సముద్యంతం దేవాసుర నమస్కృతం
పూజయస్వ వివస్వంతం భాస్కరం భువనేశ్వరం॥

7. సర్వదేవాత్మకో హ్యేషః తేజస్వీ రశ్మిభావనః
ఏష దేవాసురగణాన్ లోకాన్ పాతి గభస్తిభిః॥

8. ఏష బ్రహ్మాచ విష్ణుశ్చ శివస్కంధః ప్రజాపతిః
మహేంద్రో ధనదః కాలో యమ స్సోమో హ్యపాంపతిః॥

9. పితరో వసవ సాధ్యా హ్యశ్వినౌ మరుతో మనుః
వాయు ర్వహ్నిః ప్రజాః ప్రాణ ఋతుకర్తా ప్రభాకర

10. ఆదిత్య స్సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్
సువర్ణసదృశో భానుః స్వర్ణరేతా దివాకరః॥

11. హరిదశ్వ స్సహస్రార్చి స్సప్తసప్తి ర్మరీచిమాన్
అగ్నిగర్భోఽదితేఃపుత్ర శ్శంఖ శ్శిశిరనాశనః॥

12. వ్యోమనాథ స్తమోభేదీ ఋగ్యజు స్సామపారగః
ఘనవృష్టి రపాంమిత్రో వింధ్యవీథీ ప్లవంగమః॥

13. ఆతపీ మండలీ మృత్యుః పింగళ స్సర్వతాపనః
కవిర్విశ్వో మహాతేజా రక్త స్సర్వభవోద్భవః॥

14. నక్షత్రగ్రహ తారాణా మధిపో విశ్వభావనః
తేజసా మపి తేజస్వీ ద్వాదశాత్మ న్నమోఽస్తు తే॥

15. నమః పూర్వాయ గిరయే పశ్చిమే గిరయే నమః
జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః॥

16. జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమోనమ
నమో నమ స్సహస్రాంశో ఆదిత్యాయ నమో నమః

17. నమ ఉగ్రాయ వీరాయ సారంగాయ నమోనమః
నమః పద్మప్రబోధాయ మార్తాండాయ నమోనమః॥

18. బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్య వర్చసే
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషే నమః॥

19. తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నా యామితాత్మనే
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాంపతయే నమః॥

20. తప్తచామీకరాభాయ వహ్నయే విశ్వకర్మణే
నమ స్తమోభినిఘ్నాయ రుచయే లోకసాక్షిణే॥

21. నాశయత్యేష వై భూతం తదేవ సృజతి ప్రభు
పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః॥

22. ఏషసుప్తేషుజాగర్తి । భూతేషుపరినిష్ఠితః
ఏషఏవాగ్నిహోత్రంచ । ఫలంచై వాగ్నిహోత్రిణామ్॥

23. వేదాశ్చక్రతవశ్చైవ । క్రతూనాం ఫలమేవచ
యాని కృత్యానిలోకేషు । సర్వఏష రవి ప్రభుః ॥

24. ఏనమాపత్సు కృచ్ఛ్రేషు । కాంతారేషు భయేషుచ
కీర్తయన్ పురుషః కశ్చి । న్నావసీదతి రాఘవ !

25. పూజయ స్వైన మేకాగ్రో । దేవదేవం జగద్గురుమ్
ఏత త్త్రిగుణితంజప్త్వా । యుదేషువిజయష్యసి ॥

26. అస్మిన్ క్షణే మహాబాహో । రావణంత్వం వధిష్యసి
ఏవముక్త్వాతదాగస్త్యో । జగామ చ యథాగతమ్ ॥

27 ఏతచ్ఛ్రుత్వామహాతేజా । నష్టశోకోభవత్తదా
ధారయామాస సుప్రీతో । రాఘవః ప్రయతాత్మవాన్ ॥

28. ఆదిత్యం ప్రేక్ష్యజప్త్వాతు । పరం హర్ష మవాప్తవాన్
త్రిరాచమ్య శుచిర్భూత్వా । ధనురాదాయవీర్యవాన్ ॥

29. రావణం ప్రేక్ష్యహృష్టాత్మా । యుద్ధాయసముపాగమత్
సర్వయత్నేనమహతా । వధేతస్య ధృతోభవత్ ॥

30. అథరవి రవదన్నిరీక్ష్యరామం ।
ముదితమనా: పరమం ప్రహృష్యమాణః
నిశిచరపతి సంక్షయం విదిత్వా
సురగణమధ్యగతో వచస్త్వరేతి॥

ఇత్యార్షే శ్రీమద్రామాయణే యుద్ధకాండే ఆదిత్య
హృదయస్తోత్రంనామ సప్తోత్తరశతతమ స్సర్గః

**ఉదయకాలమున స్త్రీలు పతిని ధ్యానించు శ్లోకములు -**

1. నమఃకాంతాయ భర్త్రేచ శిరశ్చంద్రస్వరూపిణే
నమశ్శాంతాయదాంతాయ సర్వదేవాశ్రయాయచ

2. నమోబ్రహ్మస్వరూపాయ సతీప్రాణపరాయచ
నమస్యాయచ పూజ్యాయ హృదాధారాయ తేనమః

3. పంచప్రాణాధిదేవాయ చక్షుషస్తారకాయచ
జ్ఞానాధారాయ పత్నీనాం పరమానందరూపిణే

4. పతిర్బ్రహ్మ పతిర్విష్ణుః పతిర్దేవో మహేశ్వరః
పతిశ్చ నిర్గుణాకారో బ్రహ్మరూప నమోస్తుతే.

(5) క్షమస్వ భగవన్ దోషం జ్ఞానాజ్ఞానకృతంచయత్
పత్నీబంధో దయాసింధో దాసీదోషం క్షమస్వమే॥
ఇతిస్తోత్రం మహాపుణ్యం సృష్ట్యాదౌ పద్మయాకృతం
సరస్వత్యాచ-ధరయా-గంగయాచ పురావ్రజ॥
సావిత్ర్యాచ కృతంపూర్వం బ్రహ్మణేచాపినిత్యశః
పార్వత్యాచ కృతం భక్త్యా కైలాసే శంకరాయచ।

[ బ్రహ్మవైవర్త పురాణం ]

## సూర్యదేవుని నిందించువారును కలరు.

సూర్యభగవానుడు హిందువులకు ప్రత్యక్షదైవము. అట్టి దేవునకు విజయస్తంభములను బోలియున్న పెద్ద పెద్ద రాతిస్తంభములు సైతము అచ్చటచ్చట ప్రతిష్ఠింపబడుచుండును.

హిందుమతమును నశింపజేయుటకై బద్ధకంకణుడగుచు **యెహోవా** అను గంధర్వలోకవాసి దేవతలపయి నున్న క్రోధముచే **సూర్యదేవతా** స్తంభములను నశింపజేయుడని తన భక్తుల కాజ్ఞాపించుచుండును. **తాను**ను ఆ పనిని జేయుచుండును. ఆ విషయమై **ప్రమాణముల** నాలకింతము.

ఇశ్రాయేలీయుల పర్వతములారా! ప్రభువయిన **యెహోవా** మాట ఆలకించుడి... ... ... ఇదుగో, నేను నిజముగా **మీ మీ**దికి ఖడ్గమును రప్పించి **మీ** ఉన్నతస్థల**ములను** నాశనము **చే**సెదను. **మీ** బలిపీఠములు పాడయిపోవును... సూర్యదేవతకు నిలిపిన స్తంభ**ములు** ఛిన్నాభిన్నము లగును... **మీ** విగ్రహములు ఛిన్నాభిన్నము లగును... సూర్యదేవతకు **మీ**రు నిలిపిన స్తంభ

ములు పడగొట్టబడును" అనుచు క్రైస్తవుల దేవుడు తెలిపి యున్నాడు.

దేవత లుండిరనియు, వారిలో సూర్యుడొక దేవుడనియు విదేశీయులు సృష్టించిన క్రైస్తవమతల ప్రభువగు యెహోవా సెల విచ్చియుండెను.

హిందూ మహాజనులారా! నిరంతరము మనచే నమస్కరింప బడు సూర్యభగవానుని యయ్యది విదేశీయుల దేవున కెంతటి కోపమున్నదో తెలిసెనా! ఆ దేవుని సూచించుచున్న స్తంభ ములు మరియు దేవాలయములు పడగొట్టబడుచుండెను. ఇక మనము చచ్చియు బ్రదికియు నొకటే. ఆ దేవుని కుమారుడే యేసుక్రీస్తు. అతని మతము మన దేశమునందెన్ని విధాలల నెగబ్రాకుచున్నది. ఇక దేవాలయముల గతి యేమగునో యెరింగింప జాలము. విదేశదేవుని కుమా రుని యొక్క జన్మము భారతదేశమున జరిగినది కాదు. కావున నతనిని భారతీయు డనుట కెవ్వరును సాహసింపరు. నిజమారయ నతడు విదేశీయుడు. అతని జన్మస్థలము మన దేశమునకు షుమారు ఇరువది వేల మైళ్ళ దూరమున నున్నది. అరేబియాను సంబంధించి యున్న ఏడెన్ గల్ఫు బొంబాయికి 16 వేల మైళ్ళ దూరమున నున్నదని అట్లాసునందు వ్రాయబడియుండెను. ఆ గల్ఫునకున్నూ ఆదాము హవ్వలు జన్మించినట్టి ఏడెన్ తోటకున్నూ రమారమి 5-6 వేల మైళ్ళయినను ఉండును. ఆ తోటకు సమీపముననే బెత్లె హేం అను నగరము కలదు. ఆ పురమున క్రీస్తుగారు జన్మించిరి. కావున నతనిని భరతఖండములోని వ్యక్తి యనరాదు.

విదేశీయుల రాజ్యమును మరియు విదేశీయుల వస్తువులను బహిష్కరించిన మనము ఆ విదేశీయుడగు క్రీస్తుగారి మతమును మాత్రము బహిష్కరింపవలదా? ఈ మాత్రమైనను తెలివితేటలు లేని జన్మమెందులకు? స్వరాజ్యమును నశింపజేసికొని విదేశరాజ్య మును నెలకొల్పనెంచిన వ్యక్తులున్నచో అట్టివారలు స్వమతమును

మంటగలుపుకొని విదేశమతమున జేరిన జేరనగును. అది దేశద్రోహకర వృత్తాంతమై యుండదా? దేశమాతను దుఃఖంపజేయు పుత్రులీ దేశమునకు శత్రువులు కాకపోరు. కావున హిందువులైనవారు విదేశమతమును స్వీకరింపరాదు. పోనిండు. క్రీస్తుమతమున ఘనమైన విషయము లెవ్వియైనం గలవా యనిన నదియు శూన్యము. ఇక నా మతమున జేరుటెందులకు?

## —: క్రీస్తు మతములోని రహస్యములు :—

మధ్యధరాసముద్ర తీరమున (మెడిటరేనియన్ సీ) యెహోవా దేవుడు పాలిస్తానా అను భూభాగమును సృజించెను. అందు బెత్లెహేం అను నగరముండెను. ఒకమా రా నగరమునకు విచ్చేసి ఆ దేవు డీ క్రింది విధముగ బల్కెను.

"యూదైయదేశపు బెత్లెహేమా! నీవు యూదా ప్రధానులలో నెంతమాత్రమును అల్పమైనదానవు కావు. ఇశ్రాయేలీయులు అను నా ప్రజలను పరిపాలించు అధిపతి నీలోనుండి వచ్చు"నని పల్కెను.

(క్రొత్త బైబిలు-మత్తయి సువా ర-2 అధ్యా- 5 వచ.)

"నా ప్రజలను పరిపాలించు" అను శబ్దములు పై వాక్యములలో కలవు. తన ప్రజలు అనువారు ప్రత్యేకముగ ఆ దేవున కున్నటుల నర్థమగుచున్నది. తనచే సృజింపబడిన ఆదాము హవ్వల వంశములలో నొక వ్యక్తి ఇశ్రాయేలు అనువాడుండెను. అతని వంశస్థులు ఇశ్రాయేలీయులు అని పిలువబడుదురు. ఇశ్రాయేలు ఆ దేవుని భక్తుడయినందున నతనినిన్నీ, అతని వంశస్థులనున్నూ పరిపాలింపనెంచి తన కుమారుడగు క్రీస్తును పంపియుండెనని పై సువార్తను బట్టి తెలియగల్గుదుము. కావున ఏసుగారు ఇశ్రాయేలీయులకు ప్రభువై యుండెననుట యోగ్యము. ఇదే విషయము బైబులునం దనేక తావులలో నుదహరింపబడినది. ఏసును సిలువపై

నుంచినపుడు ఆ దేశపు ప్రజలు వేలకు వేలుగ విచ్చేసి యీ క్రింది విధముగ నుడివిరి.

> "నీవు దేవుని కుమారుడ వయితే సిలువమీదనుండి దిగుమని చెప్పుచు ఆయనను దూషించిరి.... శాస్త్రులును పెద్దలును... ఆయనను అపహసించుచు - ఇతరులను రక్షించెను. తన్ను తానే రక్షించుకొనలేడు. ఇశ్రాయేలు రాజు కదా! ఇప్పుడు సిలువమీద నుండి దిగిన యెడల వాని నమ్ముదుము." అనిరి.
>
> (మత్తయి సువార్త-27అధ్యా-40 వచనమునుండి)

పై వాక్యములలో క్రీస్తుగారు యిశ్రాయేలీయులకు రాజు అని యుదహరింపబడెను. దీనింబట్టి "ఇశ్రాయేలీయులే క్రీస్తును విశ్వసింప దగినవారు. క్రీస్తు సైతము వారల నుద్ధరించుటకే యీ లోకమున జన్మించియుండెను" అనునది సారాంశము. ఇంకను మరెన్నియో ప్రమాణములు కలవు. ఇశ్రాయేలీయుల పండ్రెండు గోత్రముల వారికి తీర్పు తీర్చునట్టి యధికారము తనది యనియు, అద్దానిని తన శిష్యుల కిచ్చివేసెద ననియు క్రీస్తు తెల్పెను. ఆ విషయమై చూడుడు.

> "నా తండ్రి నాకు రాజ్యమును నియమించినట్లుగా నా రాజ్యములో... ఇశ్రాయేలు (యొక్క) పన్నెండు గోత్రముల వారికి మీరు తీర్పు తీర్చుటకై నేనును మీకు రాజ్యమును నియమించుచున్నాను" అనెను.

దీనింబట్టి ఇశ్రాయేలు యొక్క వంశస్థుల కొరకు క్రీస్తుగారు విచ్చేసిరని యర్థమగుచుండెను. కావున హిందువులు ఆ వ్యక్తిని ప్రార్థించినను ప్రయోజనము కలుగదు. క్రీస్తుగారి తండ్రియు తాను ఇశ్రాయేలీయులకు దేవుడననిపల్కెను.

యెహోవా అను నేను వారికి ఉత్తర మిచ్చెదను.
ఇశ్రాయేలు దేవుడనయిన నేను వారిని విడనాడను.
(పాతబైబిల్-యెషయా-41 అ. 17 వ)

పాఠకులారా! ఆ దేవుడు ఇశ్రాయేలీయులకు దేవుడనిగ్రహింపుడు. యెహోవాచే సృష్టింపబడిన వారిలో ఇశ్రాయేలీయులు గాక ఇంకను మరెందరో కలరు. వారు ఆ దేవుని ధిక్కరించి విరోధులయిరి. కావున నా దేవుడు వారిని తన ప్రజలక్రింద పరిగణింపక- "అన్య జనులు" అని పిలుచుచుండెడివాడు. పాఠకులు ఈ విషయమై మరువరాదు.

"అన్యజనులు" అను విషయమున బైబులునందు ఏమని వివరింపబడినదో చూతము. హేరోదు అను రాజు పాలిస్తానా లోని యూదయ్యా దేశమును పాలించునపుడు బెత్లెహెం నగరమున క్రీస్తు జన్మించెను. ఆరాజు తన శిశువును(క్రీస్తును)జంపనెంచెనని విని మరియమ్మ అను తల్లి- ఆ పురమును విడనాడి యెచటికో వెళ్ళెను. ఆ దేశమున రోమన్ గవర్నరు పిలాతు అనువాడొకడు కలడు. క్రీస్తును సిలువపై నిల్పి హొడిపించినవాడు ఆ పిలాతు అని యెరుంగుడు. ఆ రాజున్నూ పై గవర్నరున్నూ పాలిస్తానా యను దేశము ననే నివసించుచుండిరి. ఈ విషయమును పాఠకులు గుర్తించుకొనిన గాని క్రీస్తుమతము యెవరి నిమిత్త మేర్పడియున్నదో నిర్ణయించుకొనజాలరు.

యూదయ్యా దేశములోని యొకానొక పట్టణమున నీ క్రింది వాక్యములలో నుదహరింపబడిన ప్రజలు సమావేశమైరని బైబిలు తెలుపుచున్నది. దానిం గాంతము.

"ఏసుకు విరోధముగా హేరోదును పొంతిపిలాతును అన్యజనులతోను ఇశ్రాయేలు (యొక్క) ప్రజలతోను ఈ పట్టణమందు నిజముగా కూడుకొనిరి" అని వ్రాయబడియున్నది.
(క్రొత్తబైబిలు-అపోస్తలుల కార్యములు-4 అధ్యా. 28 వచ.నుండి)

పై వాక్యముల మూలమున ఒక హేరోదేగాక పిలాతున్నూ అన్యజనులున్నూ ఇశ్రాయేలీయులున్నూ ఒకతావున జేరియుండిరని విశదమగుచున్నది. ఆ స్థితిలో అన్యజను లెవరై యుందురని నిర్ణయించుకొనవచ్చును. ఆ దేశముననే నివసించువారలై యుందురు. ఆ దేవుని సేవించుచున్న ఇశ్రాయేలీయులు గాక ఆ దేవుని విరోధించుచున్న యెహోవీయు లెందరుండిరో వారెల్లరు అన్యజనులై యుందురు.

దైవభక్తులగు ఇశ్రాయేలీయులున్నూ
దైవద్రోహులగు అన్యజనులున్నూ

ఆ విదేశదేవునిచే సృష్టింపబడిన భూభాగమందే నివసించియుండిరని యర్థమగుచున్నది. విదేశీయదేవునకు సంబంధించియున్న భూభాగము ఆరు వేలేండ్ల క్రిందట సృష్టింపబడెను. ఆ సమయమున సృజింపబడినవారలే ఆదాము హవ్వలు. ఆ భూమిగాక మనుబ్రహ్మచే సృష్టింపబడిన జగము 195 కోట్ల 58 లక్షల 85 వేల 67 సం॥ల నుండి ప్రచలితంబగుచుండెను. ఆ భూమికి సంబంధించియున్న భాగము మన భరతఖండము. కావున భారతీయులు జన్మించిన యనంతరము అనగా 195,58,79,067 సంవత్సరము లతిక్రమించిన పిదప ఈనడుమనే క్రైస్తవులయొక్కయు, మహమ్మదీయుల యొక్కయు మూలపురుషులగు ఆదాము, హవ్వలు సృష్టింపబడిరని నిశ్చయమగుచున్నది.

భారతీయుల జనసంఖ్య పెరిగినకొలది యీ దేశమున నిలువనీడలేక చుట్టుప్రక్కలనున్న ఖాళీప్రదేశములకు వలసబోయిన వారలైరి. ఆఫగనిస్థాన్, బెలూచిస్థాన్, ఈరాక్, ఈరాన్ (పర్షియా) జర్మనీ, ఇంగ్లండ్, ఫ్రాన్స్, అరేబియా, రష్యా దేశములందంతటను వ్యాపించి అచటనే నిల్చిపోయిరి. కనుకనే ఆయా దేశముల లోని భూమిని త్రవ్వుచుండ హిందు దేవాలయములు దృశ్యమగు

చుండెను. మనుబ్రహ్మయొక్క సృష్టి జరిగినపిదప పాలిస్తానా అను నది విదేశ దేవునిచే సృష్టింపబడెనని యెరుంగుడు. బైబిలులోని అన్యజనులెల్లరు పాలిస్తానా లోనివారేసుమా యని నిర్ణయించు కొనుడు. అన్యజనులు అను పేరు యెటులగల్గెనో తెలియనియెడల పాఠకులు సంశయగ్రస్తు లగుచుందురు.

యెహోవాయొక్క గుణము హింసాకాండకు సంబంధించి యుండును. కనుకనే అతనిచే సృజింపబడినవారైయున్నను ఎందరో ప్రజలు వ్యతిరేకించియుండిరి. అదిమొదలు ఆ దేవ్రుడు వారి నంద రిని తన ప్రజలు అని వచింపక అన్యజనులనుచు వ్యవహరించెను. అయిననేమి? ఏనాటికైనను తన బిడ్డలు తన త్రోవలోనికి రావలె నని యూహింపడా? కనుకనే తన ప్రియకుమారుడైన క్రీస్తును పాలి స్తానాకు పంపెను. ఇక క్రీస్తుగారి కార్యక్రమ మేరీతిగ నుండవలెనో తెలియుదము. తన తండ్రియొక్క కఠినములగు మాటలలోని భావ ములను సడలించుచు చల్లచల్లగను, మెల్లమెల్లగను భాషించుటకు మొదలిడవలెను. అందుకనియే తన శిష్యులను ప్రచారమునకై పంపునపుడు, "మీరు అన్యజనుల దారిలోనికి వెళ్ళకుడి. కాని ఇశ్రాయేలు (యొక్క) వంశములోని నశించిన గొర్రెలయొద్దకే వెళ్ళుడి" అనుచు బాగుగ హెచ్చరించుచు వచ్చెను. ఆ దేశపు ప్రజలు ఇశ్రాయేలుయొక్క వంశస్థులైయున్నను కాలము గతించిన కొలది తమ దేవుని ధిక్కరించుట కలవడిరి. అట్టివారలు నశించిన గొర్రెలక్రింద లెక్కింపబడుదురు. కావున ముఖ్యముగ వారివద్దకే పొండు అనియు నాజ్ఞాపించెను. పొట్టతిప్పలకై అన్యజనులున్ను ఇశ్రాయేలీయులున్ను పాలిస్తానాను విడనాడి మనుబ్రహ్మచే సృజింప బడిన భూభాగములకుం బోవుచునుండిరి. వారినందరిని చెదిరిపోయిన గొర్రెలు అనుచు బైబిలునందు వ్రాయబడియున్నది. చూడుడు-

ఏసు ఆ జనముకొరకును ఆ జనముకొరకు మాత్రమేగాక చెదిరిపోయిన దేవుని పిల్లలను ఏకముగా సమకూర్చుటకును చావనై యున్నాడని ప్రవచించెను. (యోహాన్. 11 అ. 52 వచ.)

చెదిరిపోయిన పిల్లలనగా నెవరో తెలియుదము: "దేవుని యొక్కయు ప్రభువయిన యేసుక్రీస్తుయొక్కయు దాసుడైన యాకోబు అన్యదేశములయందు చెదిరియున్న పన్నెండు గోత్రములవారికి శుభ మని చెప్పి వ్రాయునది" అని బైబిలునందు కలదు.

( యాకోబు భక్తకోటికి వ్రాసిన పత్రిక. క్రొత్తబైబిల్ )

ఇశ్రాయేలీయులు అన్యదేశములకు వలసబోయినపుడు తమ దేవుని మరచియుందురు. అట్టివారిని చెదిరిపోయిన పిల్లలనియు, గొర్రెలనియు బైబిలునందున్న యీ తావులలో నుదహరింపబడెను. వారలేగాక పాలిస్తానీయులలోని " అన్యజనులున్న " వలసబోయి యుందురు. వారికి వెలుగుకల్గించుటకు క్రీస్తు యత్నించియుండెను. అంతియేకాని ప్రజలలో తన మతమును అన్యదేవునిచే సృజింపబడిన వారిలో వ్యాపింపజేయనెంచెననరాదు. ఎవరైనను సరియే తమ మతమును తదితరులకు బోధింపరాదని క్రీస్తుగారి యభిమతము. ఆ విషయమై స్వయముగ క్రీస్తుగారే తెల్పిరి.

" అయ్యో! వేషధారులైన శాస్త్రులారా! పరిసయ్యులారా! ఒకనిని మీ మతములో కలుపుకొనుటకు మీరు సముద్రమును, భూమిని సంచరింతురు. అతడు ( మీ మతమున ) కలిసినపుడు అత నిని మీకంటె రెండంతలు నరకపాత్రునిగా జేయుదురు " అనెను క్రీస్తుయేసు.

(మత్తైసువార్త. 23 అ. 15 వ.)

ఒక మతమును అనుసరించువారికి రెండవవారి మతము నరక ప్రాయమని హెచ్చరించియున్న క్రీస్తుగారి ధోరణినైనను ఆలకించి క్రైస్తవులు తమ మతమును హిందువుల హృదయములలోనికి జొప్పించుటకు యత్నింపరాదని తెలియుదురుగాక. కావున క్రీస్తు మత ప్రచారమును వెంటనే విరమింపవలెనని హెచ్చరించుచున్నా ను. క్రీస్తుగారి దృష్టిలో ఆ దేశపు శాస్త్రుల మతము చెడ్డది కావ

చ్చును. ఆ శాస్త్రిల దృష్టిలో క్రీస్తుమతము చెడ్డది. ఆ క్రీస్తు మతము హిందువుల దృష్టికి దోషభూయిష్టమై యుండును. హిందువుల మతము క్రైస్తవుల దృష్టికి చెడ్డది కావచ్చును.

కావున అన్యమతముల జోలికిం బోక తమ మతమును తమ వారికొరకే ప్రచారమొనరింపజేయుట శ్రేయము. ఆ విషయమును క్రీస్తుగారి ధోరణివలన దెలియగల్గుదుము. దాని నెవ్వరును కాదన జాలరు.

"పరధర్మో భయావహః" అనుచు కృష్ణభగవానుడున్నై తమ అన్యమతమును విడువుడని యెంతయో విపులముగ బోధించి యుండెను. ఎందుకన పరధర్మము నరకరూపమగు భయమును కల్గించునని యా మహనీయుని యాశయము.

మతముయొక్క మార్పిడి కంటె ఘోరతరమగు దేశద్రోహము వేరొకటి లేదు. అది వెంటనే యణగారిపోవలెను. అందుకై ప్రతి వ్యక్తియు శక్తివంచన లేని కృషిని గావింపవలెను. విద్యావంతులు- ధీమంతులు- ధనవంతులు- బలవంతులు- మరియు స్త్రీలును, పురుషులును- బాలురును, బాలికలును క్రీస్తుమతస్థుల బోధల నెంతమాత్రము దరిజేరనీయరాదు. హాలాహలమును మ్రింగుట కెవరును సాహసింపరు గదా! ఆ దృష్టితో బ్రతికినం జాలు. క్రీస్తుమతము మనల నధోగతికిం దెచ్చునని యెరింగిన వారును, సంసారములను రక్షింపనెంచుకొననెంచినవారును వేవేగ హిందుమత గ్రంథమాలలోని పుస్తకముల నన్నింటిని దెప్పించుకొని పఠించుచుండవలెను. లేదేని యజ్ఞానాంధకార రూపమగు సంసారసాగరము నీదజాలక జాతిని సముద్రముల పాలొనరింపగలరు.

## —: క్రీస్తుగారి బోధలు :—

క్రీస్తుయొక్క బోధల నెరుంగనివారు క్రీస్తుమత మెంతయో గొప్పదని భావించుచుందురు. ఇక్కాలమున నది యొక లోపము.

తనను విశ్వసించినవారికి పరలోక రాజ్య ప్రవేశము కలుగ నేరదని యొకచోట్టైన గట్టిగ నొక్కి చెప్పుచున్నను అట్టి ఆ క్రీస్తును విశ్వసించునంతటి బుద్ధి దౌర్బల్య మేలకల్గెనో తెలుపజాలకున్నాము. క్రీస్తు పై రీతిగ దెల్పియుండెనా అనియు మరిమరి వాదింపనెంచువా రుండిరి. అదేమి కర్మమో! పెద్దమ్మ ముసించె ననవచ్చును. కలిపురుషుడు వారిలో దూరి యీ రీతిగ పురికొల్పియుండును. దయ్యము పట్టినప్పుడు స్వబుద్ధు లుండవుకదా! విదేశభూతము లావేశింప నటుపైన నిజము నోచరించునేమి? క్రీస్తుగారు పై రీతిగ వచించిరో లేదో బైబిలును గాంతము.

> "ప్రభువా, ప్రభువా! అని నన్ను పిలుచు ప్రతివాడు పరలోక రాజ్యములో ప్రవేశింపడు. కాని పరలోకమందున్న నా తండ్రి చిత్తప్రకారము చేయువాడే ప్రవేశించును" అని క్రీస్తుగా రనిరి.
>
> (క్రొత్త బైబులు- మత్తయి-7 అధ్యా. 21 వచ. నుండి)

తన నామము నుచ్చరించుచు నెంతగ విలపించుచున్నను అట్టి భక్తుడు పరలోకమునకుం జేరడని క్రీస్తుయేసు బాగుగ వివరించి యుండెను. ఇంతకు మించిన ప్రమాణ మేమికావలెను? మంచిది. అయినను ఆతడు పరలోకమున కేగుట కొక మార్గమును తెల్పెను. ఆ రీతిగ నాచరించువారికి పరలోక ప్రవేశము కలుగునని దాని భావము. అద్దాని నాలకింతము.

> "ఆ దినమందు (ప్రళయానంతరము! విచారణ జరుగు చున్న సమయమున) అనేకులు నన్ను చూచి ప్రభువా, ప్రభువా! మేము నీ నామమున ప్రవచింపలేదా! నీ నామ మున దయ్యములను వెళ్ళగొట్టలేదా! నీ నామమున అనేక మైన అద్భుతములు చేయలేదా? అని చెప్పుదురు. అప్పుడు

నేను "మిమ్ము ఎన్నడును ఎరుగను" అక్రమముచేయువార లారా ! "నాయొద్దనుండి పొండు" అని వారితో చెప్పుదును. అని క్రీస్తుగారు వివరించిరి. (మత్తై 7 అ. 21 వచ. నుండి)

ఇదేమి వింత ! ఆ భక్తులు హృదయపూర్వకముగ బహు శ్రద్ధతో కడుంగడు జాగరూకులై క్రీస్తును ప్రార్థించియుండిరా లేదా? బాగుగ విశ్వసించుచు సేవించినందుననే — క్రీస్తునామముం జెప్పుచు దయ్యములను మరియు వ్యాఘులను తరిమివేయగల్గిరి. ఇపు డెందరో క్రైస్తవులు కలరు. వార లాపనులం జేయగలరా ? కనుకనే వారెల్లరు చెప్పదగినంత భక్తులు కారని యర్థమగుచున్నది. ఆనాడు క్రీస్తుగారితో ప్రసంగించిన వ్యక్తులు నిజమయిన భక్తులై యుండిరి. అట్టివారల మొరలను సైతము వినక నిరాకరించుచు - "మిమ్ముల నే నెరుగను- వెళ్ళిపొండు" అని గెంటివేసిన క్రీస్తును ఈనాడు ఎవరు ప్రార్థించినను ఫలము శూన్యమే యగును. ఇక నతని మార్గమున నడచు టెందులకో తెలియజాలకున్నాము. తనను విశ్వసించువారు పాపులై యున్నను వారిని క్షమింతునని తెల్పిన క్రీస్తుగారి మాట లేమయినవి ? నిరర్థకము లయ్యెను. నా తండ్రియగు యెహోవా యొక్క ఆజ్ఞలను మన్నించుచు అనగా నత డాజ్ఞాపించినరీతిగ నాచరించుచు- 'ఏసుప్రభో ! మీ తండ్రియొక్క అనుగ్రహమునకు నేను పాత్రుడనై యున్న కారణమున అతనివద్దకు నన్ను చేర్చుటకై నీవే తప్ప యితరు లెవ్వరును లేరని నిన్ను విశ్వసించితిని' అని నన్ను శరణుజొచ్చినయెడల - అది దేవుని చిత్తమైయుండెనని యెంచి అట్టి భక్తులను పైకి లేవదీయగలడని యర్థమగుచున్నది.

బాగుగ వినుడు :

" నా తండ్రియొక్క అనుగ్రహము ముందుగా నార్జింపుడు. అటుపైన నావద్దకు రండు. నేను నా తండ్రికి లోబడియున్నాను. అంతియకాని నేను స్వతంత్రుడను కాను. అతని చిత్తప్రకారము

వ్యవహరించుట నావిధి. కనుక ప్రజలారా! నా తండ్రిగారి బోధ లెన్నియో కలవని గ్రహింపుడు. వానిని పూర్తిగా నాచరింపుడు" అని క్రీస్తుగారి భావము. మరియు-

"నన్ను పంపిన తండ్రి వానిని (భక్తుని) ఆకర్షించి తేనేగాని యెవడును నాయొద్దకు రాలేడు" అనెను.

(యోహాన్. 6 వ అధ్యాయం 44 వ.)

"నా తండ్రి యొక్క భక్తుని యాకర్షింపవలెననిన ఆ భక్తు డెన్నియో శ్రమలకోర్చినవాడు కావలెను. అనగా నాతండ్రియొక్క ఆజ్ఞల నన్నింటిని పాటించుటకు శ్రమించినవాడు కావలెను. అంతట నా తండ్రియగు యెహోవా సంతసించి తన ప్రియకుమారునివద్దకు అనగా నావద్దకు అతనిని బంపును" అను భావము వచ్చునటుల బల్కెను. తన తండ్రి యనుగ్రహించిన వ్యక్తిని వెలుపలకు పోనీయక నిత్యజీవముకల్గిన వానిని చేయుననియు కనుకనే క్రీస్తును సేవించుటకు పూర్వము ఆతని తండ్రిని సంతసింపజేయవలెననియు విశదమగు చున్నది. పై విషయమును బైబిలునందే చూడవచ్చును -

(నా)తండ్రి నాకు ఆనుగ్రహించినవా రందరును నా (క్రీస్తు) యొద్దకు వత్తురు" అని క్రీస్తుగారనిరి. యోహాన్. 6 అ. 37 వ)

ఇందలి భావమును తెలియుదము. ఎవడయినను తన తండ్రి యొక్క (యెహోవాయొక్క) అనుగ్రహమునకు పాత్రుడయినప్పుడు ఆ తండ్రి తన భక్తుని క్రీస్తువద్దకు పంపగలడని యర్థమగుచున్నది. కావున క్రైస్తవులయినవారలు యెహోవాను ముందుగ సంతృప్తిపర చుటకు యత్నింపవలెనని తోచుచున్నది. కావున ఆ దేవునకు తృప్తి కరము లయిన విషయము లెవ్వియో చూతము-

క్రైస్తవమతమును స్వీకరించినవారు వెంటనే యా విషయ ములం దెలిసికొని ఆ ప్రకారము నడచితీరవలెను. అంతట యెహోవా

తనివిజెంది యా భక్తుని క్రీస్తుకడకు బంపును. ఆ వ్యక్తి యెహోవా యొక్క అగ్నిపరీక్షలో నారిదేరినవాడగుటచే నా దేవు డనుగ్రహించి తనవద్దకుం బంపియుండెనని నిశ్చయించుకొని - క్రీస్తు అతనికి నిత్యజీవము ననుగ్రహించును. అంతట పరలోకనివాస మేర్పడును.

పై వాక్యములలోని సారాంశము నాలకింపుడు.

విదేశ దేవుడు తన ప్రజలంగాంచినపుడు ఏమని హెచ్చరించెనో, ఆ విషయములను బాగుగ నర్థముచేసికొని ఆ దేశపుప్రజలారీతిగ నాచరించినగాని యాతనికి సంతృప్తి కలుగదు. అటుల జరిగియుండె ననుకొందము. వెంటనే వారిని క్రీస్తున కనుగ్రహించును. అనగా నతని వద్దకుం జేర్చును. అంతట క్రీస్తుగారేమనెదరో వినుడు.

(1) దారి తెరువు గానక నెచటనో పడియున్న భక్తులను నేను లేపి తీరవలె ననుటయే దేవుని చిత్తమై యుండును.

(2) మరియు నన్ను విశ్వసించిన ప్రతివాడును నా (క్రీస్తు) మూలమున నిత్యజీవము పొందవలె నను నదియే దేవుని చిత్తమై యుండునని క్రీస్తుగారి మాటలమూలమున తెలియగల్గుదుము. అడుగున పడియున్నవారిని లేవదీయుట నొకటియు, తనను విశ్వసించిన వారికి నిత్యజీవము ననుగ్రహించుట వేరొకటియు తనకు విధులై యున్నవనుచు ఆ రెంటి విషయమై దేవుని చిత్తము తపించుచుండునని క్రీస్తు ప్రకటించియుండెను. అతని చిత్తమునకు సంతృప్తి కలుగవలె ననిన - నతని ప్రజలు అనగా యెహోవీయులు ఆ దేవుని యాజ్ఞల ననుసరించుచు కత్తులతో దేవతా విగ్రహములను - మరియు తదారాధకులను నరికివేయవలె నను విషయమును పాఠకులు మరచి పోరాదు.

భారతీయులను పై తను సంబోధించుచు దేవుడు శాసించి యుండెనని క్రైస్తవు లనెదరు. విగ్రహారాధకులం బట్టుకొని వారి

నిన్ని - వారి విగ్రహములనున్ను నరికివేయుడని దేవు డెన్నడును చెప్పియుండడు. క్రీస్తుగారి యాజ్ఞలు సైతము భారతీయుల విషయమై యేర్పడినవి కావు. మరియొక దేవునిచే సృష్టింపబడిన జనులను తన మతములోనికి రప్పింపవలెనని క్రీస్తుగా రెన్నడును తలచియుండలేదు. దేశదేశములకుం బోయి తన సువార్తను ప్రకటింపుడని క్రీస్తు హెచ్చరించిన మాట నిజము. మంచిది. ఎవరి నుద్ధరించుటకై తన శిష్యులం బంపెనో తెలియవలదా? పాలిస్తానమునువిడనాడి పొట్టకూటికై యాయా దేశములకు వలసబోయిన యెహోవీయులకు ధర్మములం బోధింపుడని తన శిష్యులకుం జెప్పియుండెను. ఈ మాత్రమైనను ఊహింపలేని వ్యక్తులు గ్రంథములం జదివియు జదువకయు నొక్కటే. అన్యమతములపై దాడి సలుపుచున్న వ్యక్తులకైనను - తెలివియుండవలెనా లేదా ? పాలిస్తానములోని క్రైస్తవులు - అన్యదేశములకు వలసబోయియుండ నట్టివారలు స్వీయధర్మములనుండి మరలిపోకుండుటకుగాను తన సువార్తను అందజేయుటకు క్రీస్తుగారు రాయబారులంబంపెను అనునది విశ్వసమ్మతమగు విషయము. మతి యున్నంతవరకు పై సత్యమును ఖండింపబూనువా రుండరు. ఇంకను సంశయమున్నచో మరల మరల నైదారుమారులయినను చదివితీరవలెను. అప్పటికిని తమ భావము మారదేని వెంటనే ఆ విషయమై ఈ గ్రంథకర్త కొక జాబువ్రాసి ప్రత్యుత్తరముం బడయవచ్చును. అంతియే కాని యిందుకు వ్యతిరేకముగ పిచ్చిపిచ్చి ప్రచారములం జేయరాదు. మరియు నది విజ్ఞుల సహజగుణమున్నూ కానేరదు. విదేశదేవుని నిజతత్త్వమును దెలిసికొనుటకై యొకమారు యాతని యాజ్ఞ లెవ్వియో తెలియుదము.

## యెహోవాయొక్క ఆజ్ఞలు :

“నీ తల్లి కుమారుడే కాని—నీ చుట్టునుండు జనముల దేవతలలో నీవును, నీ పితరులును యెరుగని దేవతలను పూజింతము రమ్మని రహస్యముగా నిన్ను ప్రేరేపించిన యెడల ... ... ... ... అవశ్యముగా

వారిని చంపవలెను.... ...రాళ్ళతో వారిని చావ గొట్టవలెను.... ఆ పురవాసులను అవశ్యముగా కత్తివాత సంహరించి వానినిన్నీ — దానిలోని సమస్తమునున్నూ — దాని (ఆ పురముయొక్క) పశువులను కత్తివాత నిర్మూలనము చేయవలెను. ఆ పురమును బొత్తిగా కాల్చివేయవలెను. అది తిరిగి కట్టబడక యెల్లప్పుడు పాడు దిబ్బయై యుండును." పాతబైబిల్ ద్వితీయోపదేశకాండ.

13 అధ్యా. 6 నుండి

అను వచనములన్నియు విదేశ దేవునివి.

1. అవశ్యముగా చంపవలెను. 2. రాళ్ళతో చావగొట్టవలెను. 3. వారినేకాదు, ఆ పురములపై దాడిసల్పి అచ్చట నివసించు గృహస్థులను సైతము చంపవలెను. 4. పాపమెరుగని పశువులనున్ను కత్తులతో నరకవలెను. 5. అందలి గృహముల నున్ను నేలమట్టముగావింపవలెను. అనునవి విదేశ దేవుని యాజ్ఞలు.

దేవుడు అనువాని గుణము లిటులనే యుండును కాబోలు! బందిపోటుదొంగలు పై పనులం జేయుదురు. వీరపురుషులు ఒకరి నొకరు చంపుకొనవచ్చును. అట్టివారలకు వీరస్వర్గము సంభవించు ననినను దోషములేదు. విగ్రహములను పూజించువారలుండిన మాత్రమున వారిపై మరియొక నేరముం జూపజాలక వెంటవెంటనే కత్తులచేపొడిపింపవలెనేమి ? విగ్రహారాధనమువలన నన్యులకు హింస రవ్వంతయైనను కలుగదే ! దేవుడయినవాడు పరుల కపకారమును జేయనివారలం జంపింపనగునా ? అది చోరత్వమా లేక జారత్వమా? రెండునుగాక మారణత్వమా ! అట్టి దోషము లెవ్వియు లేనపుడు - విగ్రహములంబూజించుచుండిరను నేర మూపాదించి కత్తులతో సంహరించుటయా ? పోనిండు. వారి గృహములలోని పశువు లేమిచేసినవి? అమాయకముగ జీవించుచున్న పశువులం జంపించుట దేవుడయిన

వానికిం దగునుకాబోలు. నిజమారయ నయ్యవి దైవలక్షణములగునా! ఆ విషయముల నటుంచుదము ఇంటి గోడలను పడగొట్టుడను టెందులకు? అవి దైవాజ్ఞలను ధిక్కరించెనా? లేదే. ఇక బిడ్డలను నేలమట్టము గావింపజేసిన దెందులకు? దేవుడనిన నారీతిగ నుండవలెను కాబోలు! పరిశుద్ధ గ్రంథమున్నా పరిశుద్ధాత్ముడగు దేవుడును నైలక్షణములతో నలంగుటయే పరమపావన తత్త్వమై యుండునేమి? విదేశమతమున నిట్టి పరిశుద్ధ విషయము లనంతముగ నుండునేమో! అబ్బా! ఆ మతమును మా హిందువుల శిరములపై రుద్దుటకు క్రైస్తవ మతప్రచారమును సాగించుచున్నారు. ప్రభుత్వము సైతము దానిని సమ్మతించెనట. గుడ్డిదర్బారువలె నున్నది మన క్రైస్తవరాజ్యము. అట్టి రాజ్యము హిందుదేశమున నెన్నడును తలయెత్తరాదు. అది మరెంతయో దారుణరాజ్యము. మరియు ఘోరమృగముల కాటపట్టయిన నరణ్యరాజ్యము ఇంకను భూతప్రేతపిశాచముల కనువయిన రాజ్యము. అట్టిది హిందువుల హృదయక్షేత్రములపై నధిష్ఠింపరాదు. రాక్షసభూములపై విహరింపదగిన రాజ్యము ఈ దేవభూమిపయి నిల్చియుండనగునా? ఇది పుణ్యభూమి. మరియు తపోభూమి. ఇంకను విచారింప కర్మ, భక్తి, జ్ఞానములకు ఉనికిపట్టయిన భూమి. ఇట్టి పరమపావనమగు ధరాతలంబున విదేశదేవుని రాజ్యప్రవేశమా! మరియు విదేశమత ప్రతిష్ఠాపనమా! అవి రెంటను సంకల్పసౌధములను బోలినవి. ఎండమావులలోని జలములను జ్ఞప్తికిం దెచ్చునవి. మేకల మెడలందున్న స్తనములకు నిడుజోడులవంటివి. నిరర్థకము లనుట నిక్కము. అక్రమములనుట సార్థకము. గొంతెమ్మకోరిక లనుట విజ్ఞుల నోటినుండి వెలువడు మాట. నిజ మారయ రాజబాట. ఇవి సందుగొందులలోని ప్రసంగములు కావు. మూల ముసలమ్మ లున్నచోట- లేదా- ఆడంగు రేకులయియున్న మగవారలున్న తావున- కాదా- నోరులేని మూగవారివలె చరించుచున్న మగవారి భార్యలు చరించుచున్న రంగములలో వారి మతప్రబోధ జరుగునేమో! ఈ రీతిగ లోకము నాక్రమించు

టయూ ! అది ఘోరమగు నేరము కాకపోదు. మహమ్మదీయులున్న తావుల కేగి మతప్రచారము నేల సాగింపరో ! వారలకు మగతన మున్నదని ఆ ప్రచారకులకుం దెలియును. ధైర్య, శౌర్య, వీర్య, పరాక్రమములు లేని హిందువులం జూచుకొని-యీ మనుష్య చేపలం బట్టుకొనుటకయి స్కూళ్ళను మరియు నాస్పత్రులను నిర్మించి అమాయక ప్రజలను మోసగించుట ఆ ప్రచారకులకు నల్లేరు పై బండి నడకవలె త్వరితగతిని సాగిపోవుచునున్నది. హిందువులు మేలొ్కనినం జాలు. ఇంటిలో జొరబడిన చోరులు పలాయనము చిత్తగించినటుల నెచ్చటవారచట నిలువజాలక వచ్చిన త్రోవన వెళ్ళిపోయెదరు. పసిపట్టి వెదకినను వారి మతమందు పస యనునది గోచరింపదు.

ఒకమారు క్రీస్తుగారి బోధల నాలకింతుమేని ఆయన తన తండ్రియొక్క బోధలలోని నిజతత్త్వమును మనసునం దుంచుకొనియే (యేసుక్రీస్తు) అదేరీతిగ నా విషయము నంతయు తు- చ- తప్పకుండ నమలు పరచుటకుగాను యత్నించినటుల నర్థమగుచుండును.

## —: క్రీస్తుగారి బోధలు :—

పాఠక మహాశయులారా ! ఇంతకు పూర్వము- ఇపుడే విని యుంటిమికదా యెహోవా యొక్క ఆజ్ఞలను. ఇటుపయిన క్రీస్తుగారి బోధల నాలకింతము. తండ్రికి సహకరించుటకే నే నీ లోకమునకు వచ్చియుంటినని క్రీస్తుయేసు పలుమారులు ప్రవచించి యున్నటుల బైబిలునందు దర్శింపగలము. అందుకనియే విగ్రహారాధకులను- మరియు, వారి పురములను కత్తులతో నరికివేయుడని హెచ్చరించిన తన తండ్రియొక్క కోర్కెలను నెరవేర్పదలచి యొక సైన్యమును సిద్ధపరచుటకు నిశ్చయించుకొనెను. అది న్యాయమే కదా! వెంటనే వేలకొలది శిష్యులను జేర్చుకొనెను. కొన్ని ధర్మముల నుపదేశించుచు- తనయందు లక్ష్య మేర్పడుటకై కొన్ని మహిమలం జూపుచు నుండెను. వానిం గాంచినపు డెవరు వశము కాకుందురు ? వెంటనే

కత్తులం గొనుడనియు వానిని విధిగా తమవద్ద నుంచుకొనుడనియు బోధింపసాగెను. గురువుగారి వాక్యముల నెవరు కాదనగలరు? ఒక మారు యీతని కత్తులబోధను విని యానందింతము.

## — కత్తుల బోధ :—

"అందు కాయన యిప్పుడయితే కత్తిలేనివాడు తన బట్ట నమ్మి కత్తి కొనుక్కొనవలెను" అని శిష్యులకాజ్ఞాపించి యుండెను. (లూకా సువార్త- 22 అ. 36 వ.)

"వారు (అనగా శిష్యులు) ప్రభువా! ఇదుగో ఇక్కడ రెండు కత్తు లున్నవనగా (ఉన్నవని చెప్పగా) చాలునని ఆయన (క్రీస్తు) వారితో చెప్పెను. (38 వచ.)

ఇంతలో శత్రువులు క్రీస్తును పట్టుకొనుటకై వచ్చిరి. ఆ వృత్తాంతమును వినుడు.

"ఆయన చుట్టు నున్నవారు జరుగబోవుదానిం జూచి ప్రభువా! కత్తితో నరుకుదుమా అని ఆయనను అడిగిరి. అంతలో ఒకడు (ఏసుగారి శిష్యుడు) ప్రధాన యాజకుని (యొక్క) దాసుని కొట్టి వాని (ఆ శత్రువు) యొక్క చెవిని తెగ నరికెను" అని వ్రాయబడియున్నది.

(49 వచనము)

శిరమును నరుకబోవగా సూటి తప్పిపోయెను. కనుకనే యా కత్తి చెవిని నరికివేసినది. నరుకుటకు యే యినుపకత్తియో, ఉక్కు కత్తియో యవసర మగును. శిష్యు డొకడు తనవద్ద కత్తులు రెండు కలవని తెల్పెను కదా! అవియు నినుపకత్తులై యుండవలెను.

మరియు విచారింప నా కత్తులు శత్రువులం జంపుట కెంతయో సహాకరించునవిగా నుండును. క్రీస్తుగారి శిష్యుల కథ లీ రీతిగ

నున్నవి. ఇక క్రీస్తుయొక్క కధయో కత్తులం గొనుడని ప్రోత్సహించునదిగా యుండెను. అంతయు కత్తులతోటి మెరయు చున్నట్టి రణరంగమును స్ఫురింపజేయునదే సుమా ఆ క్రీస్తుగారి వర్గము! యేసుగారిచే వివరింపబడిన ఆ కత్తియు కొనవలసినదిగా నున్నందున నదియు నినుపకత్తియే యగును. కాదని వాదింపగల వ్యక్తు లొక్కరును ఉండరని యెల్లరము సమ్మతింపగలము. విషయ మిటులుండ క్రీస్తుగారిచే బోధింపబడిన కత్తి యినుపకత్తి కాదనియు, నది జ్ఞాన ఖడ్గమై యుండెననియు తారుమారుగ మాటాడుచుందురు క్రైస్తవులు. అది వారి దౌర్జన్యకాండ.

విగ్రహములను, విగ్రహారాధకులను కత్తులతో నరికివేయుడని హెచ్చరించిన తన తండ్రిగారిని తన హృదయమునం బెట్టుకొనడా యేమి ఆ క్రీస్తు! వీని నన్నిటిని మరపింపనేల? ఆ దేశపు జాతియే హంటింగ్ నేషన్ అని పేరు గాంచినది.

స్వరాజ్యము నీయదలచినపుడు క్రైస్తవ ప్రభుత్వము మాత్రము చేసిన దేద్ది? కాంగ్రెసువారిని యేమని కోరియుండెనో చూడుడు. మా మతప్రచారమును మీ దేశమున జేసికొనుటకై సమ్మతింపవలెనని కోరెను. స్వరాజ్యము వచ్చినం జాలునను ఆశతో మన ప్రభుత్వము ఆ యొడంబడికకు లొంగిపోయినది. మిషనరీలు ముందుగ దిగెదరు. అటుపయిన మెషీన్ గన్సు (మరతుపాకులు) దిగుమతి యగుచుండును. ఇది క్రైస్తవుల రాజ్యతంత్రము. దానినే హృదయమున నుంచుకొని ఆంగ్లేయులు స్వరాజ్యము నొసంగి వెళ్ళిరి. అది మొదలు కోట్లకొలది రూప్యములను వెచ్చించుచు హిందుదేశమం దంతటను చర్చిలను నిర్మింప జేసిరి. ఏడు కోట్లమంది క్రైస్తవులను యీనాటికి సిద్ధము చేయ గలిగిరి. వీరందరు కత్తులం బట్టుకొని సైనికులుగా తయారయిననాడు మన స్వరాజ్య మేమగును? ఆ సమయమున హిందువు లెచటి కేగెదరు? ఈ విషయమును గుర్తింపజాలక క్రైస్తవు లెంతయో దేశసే

వను గావించుచుండిరని తెలివి యున్నవారును, తెలివి లేనివారును పాతములు వల్లించుచుండిరి. ఆ సేవ యంతయు మనలను జీవచ్ఛవములుగా సిద్ధపరచుటకని గ్రహింపగల వ్యక్తులు నేడు గోచరింపరైరి.

పై రీతిగ వారి చర్య లున్నవని యెరింగినవార లున్నను విదేశీయులగు క్రైస్తవుల మెప్పులకై సభావేదికలపై నిలువబడి యుపన్యసించుచున్న హిందువులు భ్రమించిరనుట యుక్తము. క్రైస్తవులు ప్రజలకు మేలు సేయుచుండిరని భ్రమించుచుండిరని భావము. మన దేశస్థుల కీ గతి పట్టినది. మనలో మనకు శతృత్వమును కల్పించుచుండిరి క్రైస్తవులు. అటులనే మన పెద్దలు సైతము గ్రామములలో కక్షల నేర్పాటు చేయుచున్నారు. పూర్వకాలమున మన హిందు రాజులలో కొందరు మహమ్మదీయులను అండగా గైకొని హిందు రాజులను జంపగా ఆ మహమ్మదీయ ప్రభువులు తమకు మేలుచేసిన హిందురాజులను సంహరించి వారి రాజ్యమును గైకొనిరి. ఆ స్థితి మరల మన దేశమునకు సంప్రాప్తమగుటకు తీవ్రతరములగు యత్నములు జరుగుచున్నవి. వానిం గమనింపలేక స్వార్థపరులగువారు క్రైస్తవుల మూలమున స్వల్పమగు లాభముల నభిలషించి వారి కోర్కెలం దీర్చుచున్నారు. ఆ బలముం జూచుకొని వారు తమ ప్రచారమును విరివిగా సాగించుచుండిరి. వారిం జూచి వీరు - వీరిం జూచి వారు అనగా అమాయకులగు హిందువులెల్లరు తమ మతమున శ్రద్ధలేని వారగుచు యే మతమైన నేమి యనుకొని ఆ విదేశమతమున చేరుచున్నారు. ఇక క్రైస్తవ జనసంఖ్య పెంపొందదా యేమి? ఏ క్రైస్తవులు యీనాడు తమ వోట్లను కాంగ్రెసువారల కొసంగుచుండిరో వారెల్లరు తమ వోట్లను రాబోవుకాలమున క్రైస్తవులకే యొసంగుచుందురు. హిందువులలో పెక్కు పార్టీలున్నందున ప్రతి పార్టీకి మితములగు ఓట్లు లభించును. క్రైస్తవులంద రొకపార్టీగా నిల్చి తమ పెద్ద పార్టీకే ఓట్లనిచ్చి గెల్పించెదరు. అంతట నీ రాజ్యము క్రైస్తవ రాజ్యముగ మారును. పూర్వకాలమున హిందువులు

మహమ్మదీయ రాజ్యము నెలకొల్పియున్న చందమున నీకాలమున పూర్వుల కంటె తెలివిగల వారమని గర్వించుచున్న హిందువులు ఈ దేశపు రాజ్యమును క్రైస్తవుల కర్పింప నున్నారు. వారి రాజ్యము దాపరించునను భయము కలిగి యీవిపత్తునుండి తప్పించుకొనుటకై హిందువులు మేల్కాంచ వలెను. హిందూదేశమున క్రైస్తవరాజ్యమును నెలకొల్పుటకుగాను - నాగాల్యాండులో యత్నములు జరుగుచునే యున్నవి. ఆ యుద్యమమును లేవదీసినది క్రైస్తవులే కదా! ఈ నడుమ ముప్పదివేలమంది విదేశీయ మిషనరీలను ఈ దేశము నుండి వెళ్ళిపొండని కాంగ్రెస్ ప్రభుత్వము హెచ్చరించినదని వార్తాపత్రికల మూలమున విని యుంటిమి. "శాంతము శాంతము" అని కలవరించుచున్న కాంగ్రెస్ ప్రభుత్వమునకు సైతము క్రైస్తవుల దుండగము లర్థమయినవి. ఇంకను తెలివి లేనివారలై హిందువులు మెలంగవలెనా?

హిందువులారా! తిరుపతి దేవస్థానమునకుం బోయిన హైందవులు భక్తిపరవశులై యర్పించుచున్న ధనము నెల నెలకు లక్షల కొలది చేరుచుండెను కదా! ఆ ధనమునం దొక లక్షయైనను హిందూమత ప్రచారమునకై వినియోగింపుడని యాందోళన మొనరింపరేల? ఆరీతిగ చేయగలమని "ఎండోమెంటుబోర్డు" ప్రచురించినంతమాత్రమున ప్రయోజనము లేదు. తమ నిర్ణయమును అమలు జరుపవలెను. త్వరితముగా నా పని నిర్వర్తింపుడని హిందూసమాజము హెచ్చరించుటకు ముందుకు రావలెను. అడగనిదే అమ్మయైన పెట్టదను సామెత కలదని యెరుంగుడు.

రహిమాన్ మతము, క్రీస్తుమతము అనునవి రెండును సూర్యుని మతము నడ్డగించుచున్నవి. ఆ స్థితి రాహుకేతువులను జ్ఞప్తికిం దెచ్చుచుండెను. అవి హిందూమతమును నశింపజేయ సమకట్టినవనుట సత్యము. ఇక నిదురింపరాదు. ఇదిమొదలు హిందూమత ప్రచారమొనరించుటకంటె గత్యంతరము లేదు. ఆ ప్రచారమైనను వందల మంది ప్రచారకులచే జరిపించబడవలెను. అందుకు ముందంజ వేయ

గల యోధు లెవ్వరు ! ధర్మదాతలగు ధనికులు గాక వేరొక రర్హులై యుండరు. ధనము నార్జించిన ప్రతివారును దానిలో నారవవంతైనను హిందుమత ప్రచారమునకై వినియోగింపవలెను. లేదేని దేశము నధోగతికిం దెచ్చినవార లగుదురు. అనగా రాబోవుతరమున నిల్చి యున్నవారిని యాకోబులుగను, జోషువాలుగను, అబ్రహాములు గను తయారుచేసినవార లగుదురు. కావున ప్రచారము చేయించు భారము ధనికులపై కలదు. విద్యావంతులు కొందరైనను సహకరింప వలెను. అనగా నన్యవిధముగా జీవించుటకు బూనక ప్రచారమునకు బూనినవారు కావలెను. చదువులు చదివినందుకు ప్రయోజనము ఇదియే సుమా ! చదువరులారా ! రాత్రింబవళ్ళు మెందరెందరిని కలియుచుందురో వారిందరికి యేదో యొక ధోరణిలో హిందూధర్మ ములను వినిపించుచు క్రైస్తవ మతస్థుల కుతంత్రములను తెలుపు చుండవలెను. లేదేని తమ బిడ్డలో లేక వారి బిడ్డలో క్రైస్తవ మత మును స్వీకరించెదరు. తమ వంశముల కింతటి పాపమును మూటగట్టు కొనుటకే జన్మించియుంటిమని ప్రకటించుకొనకుడు. నీతిజాతుల మర్మములం దెలుపజాలని విద్య విద్యయనిపించుకొనదు.

ప్రకృతమునకు వత్తము. కత్తిని కొనుడని క్రీస్తు హెచ్చరించి నను ఆకత్తి ఇనుపకత్తికాదని క్రైస్తవమత ప్రచారకులు వాదించు చుందురు. ఆమోసమును గుర్తింతము. క్రీస్తుగారి కత్తి యినుపకత్తి కాదట. అది జ్ఞానఖడ్గమని మోసగించుచున్నారు.

36 వ వచనం — కత్తి కొనుడని క్రీస్తు హెచ్చరించెను.

38 ,, ఇదిగో ఇక్కడ రెండు కత్తులున్నవని శిష్యుడనెను.-

49 ,, — కత్తితో నరకుదుమాయనుచు శిష్యులు విన్నవించిరి.

50 ,, — క్రీస్తుగారి శిష్యుడొకడు తన యెదుటనున్న అన్యమతస్థుని కుడి చెవిని కత్తితో నరకి వేసెను.

పై వచనములన్నియు ఒకదానివెంట మరియొకటి బయలు దేరినవేకాని వేరువేరు సందర్భములలో ప్రసంగింపబడినవి కావు. కావున కొనుడని హెచ్చరింపబడిన కత్తియు మరియు నరుకుటకై యేర్పడిన కత్తియు నివిరెండు ఇనుపకత్తులేయనుటకాక్షేపణము లేదు.

క్రీస్తుగారు తన తండ్రియైన యెహోవావలె బోళావాడుకాడు. అనగా బయటపడువాడుకాడు. ఈ వ్యక్తియొక్క ఉదంతమంతయు లోలోన స్వయంపాకమును బోలియుండును. చల్లచల్లగ భాషించుచు నన్యులను తమ వలలయందు వేసుకొనువా రెందరు లేరు? ఆ శ్రేణిలోని వ్యక్తియైయుండి క్రీస్తుగారు మనుష్యచేపలం బట్టుచు నుండును. శత్రువుల చెవులు నరకబడినపుడు క్రీస్తుగారి భావ మెటు లుండెనో తెలియుదము. తాను శాంతిదూతకదా! దౌర్జన్యమును గావించుచున్న శిష్యుని తనవద్ద నుంచుకొనవచ్చునా? వెంటనే యతనిని వెళ్ళగొట్టవలయును. లేదా శిక్షింపవలెను. అవి యెవ్వియు చేయక మౌనము వహించెను. దండించుటకు వీలుకలుగని యెడల నాతని పాపమును తానైనను అనుభవించుటకై స్వయముగ తానే శిక్షించుకొనవలెను. అనగా తుదకు కొన్ని యుపవాసములనైన గావింపవలసియుండును. అటుల నాచరింపక క్రీస్తు దిగులు చింతలు లేనివాడయ్యెను. అది యోగ్యము కానేరదు.

మరియొక రహస్యమును వినుడు. అయితే ఏసు "ఈమట్టుకుతాళు డని" చెప్పి వానియొక్క చెవి ముట్టి బాగుచేసెను.(51 వచ) వింటిరా! యేసుగారి వచనములను! దెబ్బతినినవాని వద్దకుంబోయి "ఈమట్టుకు తాళుడు" అనెను. అనగా ఈ విధముగ ననుభవింపవలసిన యవసర మేర్పడెను. కావున "ఆ విషయమై సహించియుండుము" అని బుజ్జ గించుచు చెవినిముట్టి బాగుచేసెను. ఆంగ్ల బైబిలునందు జూలేమ-

**" Jesus answered and said, suffer you thus far " And he touched his ear, and healed him.**

అనెను. ఇంతవరకు అనుభవించినది చాలును అని చెవిముట్టి బాగు చేసెను. కత్తులతో నరకవలసిన సమయము వేరుగా నున్నది. అది సమీపించువరకు మనము త్వరపడరాదు. అనగా కత్తుల నుపయోగింపరాదు. ఆ సమయమును మీరే తెలిసికొనగలరు అనుచు జరుగనున్న యుద్ధముల విషయమును సూచించియుండెను. అది ప్రవక్తయొక్క లక్షణముకాదు. స్వరాజ్యోద్యమ సమయమున నొకమారు ప్రకాశంపంతులుగారు ఏమనిరి? "ఇదిగో! నన్ను తుపాకితో పేల్చుడు " అని తన రొమ్మును జూపెను. క్రీస్తును పట్టుకొనుటకు శత్రువులు వచ్చి రనుకొందము. ప్రజల పాపములకై మరణింతునని చెప్పిన క్రీస్తుగారివిషయమున శిష్యులుదిగులొందనేల? ఎంతకాలమునుండియో క్రీస్తుచే నుపదేశింపబడిన ధర్మము లిటులనే యుండినవి కాబోలు. ధర్మప్రబోధముగావించుచు ప్రజల పాపములను తనపై వేసుకొని మరణింతునని తెల్పిన క్రీస్తు సమయమే తెంచినపుడు అనగా శత్రువులచే మరణింపనున్న కాలమే తెంచినపుడు తప్పించుకొన జూచెను. అన్యులను నరుకుటకై యత్నించిన శిష్యులను మందలించుటకైనను తలంపని క్రీస్తుగారి మతమున జేరు టెందులకో యిపుడర్థమగుచున్నది. పాపములం జేయవచ్చునని యే తమ మతమును విడనాడుచుండిరి. హిందువులు భూతములను మరియు వ్యాఘులను తరిమివేసిన శిష్యుల విషయమై క్రీస్తుగా రేమనిరో తెలియుడు-

" మిమ్ముల నేనెరుగను. నావద్దనుండిపొండు " అని పల్కెను.

( మత్తై 7 అ. 23 వ వచనం )

అనేక రోగములను సైతము ఏసునామప్రభావముచే పోగొట్ట గలిగిన శిష్యులను అక్రమపరులలో లెక్కించి వెంటనే గెంటివేసిన క్రీస్తు రక్కసులవలె చెలరేగిన శిష్యులు తమకత్తులతో నరకుటకుసిద్ధమైనపుడు వారిపై నొక్కింతయైనను క్రోధమును చూపని వాడయ్యెను.